# కన్నడ

[ కథలసంపుటి ]

రచయిత:

మల్లాది రామకృష్ణశాస్త్రి

పబ్లిషర్సు

ది మోడరన్ న్యూస్ ఏజన్సీ

గవర్నరుపేట — బెజవాడ.

# కన్నడ

ఎదురుగుండా మేడలో ఉన్న మనోహరం తల్లి, కూతురి పాత ఖాతాదారుణ్ణి ఎవడినో, నడిరోడ్డుమీద నిలవేసి నానా దులుపులూ దుల్లుపుతూంది... రాక్షసి గొంతుతో.

పక్క యింట్లోనుంచి, జోలపాట వినబడుతూంది.

డాక్టరు బల్లదగ్గిర కూర్చుని, పాత కేటలాగులు తిరగ వేస్తున్నాడు. నేను కుర్చీలో పడుకుని, హెల్తు మేగజీనుల దొంతరలోనుంచి ఒక్కొటొక్కటే లాగి, బొమ్మ బొమ్మా పరికాయించి చూస్తున్నాను.

...మాట్లాడేందుకు ఏమీ లేక, ఏదో గొడవ పెట్టుకుని, భోజనంవేళదాకా ఎవరి త్రోవను వారు, ప్రొద్దు బుచ్చుతున్నాము.

— ఆ అబ్బాయి వచ్చి ... నమస్కారం చేశాడు. డాక్టరు ఎదురుగుండా కుర్చీ చూపించాడు. నేను తల ఎత్తి చూసి... మళ్ళా బొమ్మమీదికి వెళ్ళిపోయింది చూపు.

"ఏమయ్యా!...ఏమిటి?" అని అడిగాడు డాక్టర్.

"ఏమీ లేదండీ..." అన్నాడు ఆ పిల్లవాడు : పిల్లవాడంటే,. పసిపాప కాదు : మా కన్న చిన్నవాడు ... మీసం వస్తూ వస్తూ ఉంది.

హుంకారం, గొంతులో గొరగొర లాడించి, డాక్టరు తనపని తాను చూసుకుంటున్నాడు.

"మీతో - మాట్లాడాలండీ" అన్నాడు ఆతడు, కొంత సేపటికి తటపటా యింపులో నుంచి తెమిలి-

"మాట్లాడు!" అని డాక్టరు కసురుకున్నాడు.

"ఒంటరిగా..."

"అయితే...ఎవరూ లేనప్పుడు రా..."

"ఎప్పుడండీ .."

"ఎవరు లేనప్పుడు ..."

నేను, పాకం ముదురుతున్నదని, అక్కడనుంచి లేవబోయినాను... "కూర్చో" అని నన్ను కూలేసి... "మంత్రసాని ముందర...ఆసామోత తెలుసును కాదూ... యిందాకా వచ్చి యిప్పుడు బిడియ పడతావేం .. ఫరవాలేదులే... మా వాడూ వైద్యుడే... ఘన వైద్యుడు!...ఒకరిద్దరిని కాదు... రోజూ పదిమందినైనా చంపుతూంటాడు...మాటలతోనేలే.."

డాక్టరు మాటలకు ఆ కుర్రవాడు ... నవ్వాడు : హ్యూమరు వాడి మొగంలాగా ఉన్నా ... పరాయివాడున్నప్పుడు, బాగుండదని ... నేనూ నవ్వక తప్పిందికాదు.

"మరి...ఒంట్లో బాగుండటం లేదండీ-"

"అలాగేం పాపం ..."

"చాలా రోజులనుంచీ..."

"అయితే యిన్నాళ్ళూ ఏం చేశావు ?"

"సిగ్గుపడి...దాచుకుంటున్నానండీ..."

"ఊఁ . పొడి అక్షరాలేం..."

"-అంటే ..అంతే, చేసేటప్పుడు ఏం తెలుస్తుంది"

"నేను-ఏమీ జేయలేదండీ..."

"ఏం చేయలా...చెడు సందుల్లోనుంచి నడవటం... పాడుచోట కాలు ముడవటం ... అదన్నా లేదూ... ఊరికే నిన్ను వెదుక్కుంటూ గాలిలో ఎగిరి వచ్చినవా ?-"

"ఏమోనండీ..."

"అడిగినదానికి ... అదా జవాబు" అవును, కాదు, అని ఖచితంగా చెప్పాలి కాని...మళ్ళా, చదువుకున్న వాడవు!"

"అడగండి..."

"ఏమిటి అడిగేది ? నీ ..."

-స్ఫురించింది: అవతల వాడిని హడల గొట్టడం, తాను సర్వజ్ఞుణ్ణనుకోవడమూ...సర్వసాధారణంగా సైతస్కోపు పట్టనేర్చిన ప్రతి వెధవాయలోనూ అంతో యింతో ఉన్నదన్న మాట, జగమెరిగినది. మా వాడిలో ఆ హంశ మరీ ప్రకోపించి ఉంది...

ఇక, నేను కలుగ జేసుకున్నాను. లేకపోతే ఆ సంభాషణకు...అంతూ పంతూ ఉండదు...

ఆ అబ్బాయిని బుజ్జగించుతూ-

"అవునయ్యా ! డాక్టర్లంటే ఏమన్నా ఆకాశంలోనుంచి ఊడి పడ్డారా ? వాళ్లూ మనలాటి మనుష్యులే ! మళయాళ మంత్రాలేమీ చెప్పరు వాళ్ళకు బళ్ళో, అవతలవాడి మనసులో ఏమున్నదో చెప్పకుండానే గ్రహించే టందుకు, అది

గాకుండా మెదడంటే ఏమిటో, దాని మంచిచెడ్డలూ సున్నితమూ . . . ఎంతో కృషిచేసి తెలుసుకున్న వాళ్ళు కనుక, దానిని ఎంతో భద్రంగా కాపాడు కుంటారు, కాని, నీలాగా, నాలాగా, అవసరం ఉన్నా, లేక పోయినా. . . అతి విరివిగా వాడేయరు: గనుక, దీనివల్ల మనం ముఖ్యంగా నేర్చుకోవలసినది ఏమంటే:- వైద్యుడికి, రోగనిదానం తెలుసుకునే ప్రయత్నంలో, రోగి సర్వవిధములా తోడుపడి . . . ఆమాట అతనికి దక్కనివ్వాలి : తెలిసిందా ? — మనం అంటే ప్రకరణాన్ని బట్టి . . . నీవే . . . యిక కానీ. . .!"

డాక్టరుకు నన్ను మింగేద్దామన్నంత కోపంవస్తూంది. . . కవళిక కనిపెడుతూనే ఉన్నాను. కాని, మనం గుడిమ్రింగే రకం : ఏం చేస్తాడు పాపం ?

ఆపిల్లవాడు దాచకుండా అంతా చెప్పాడు. చెప్పినదంతా మావాడు సావధానంగా, అర్ధ నిమీలిత నేత్రాలతో,విన్నాడు.

'ఊఁ. . .కలలు వస్తూంటాయా?'

'ఆఁ...'

'ప్రతిరాత్రీ...'

'అవునండీ...'

'కలలు, మారుతూంటాయా...'

'సాధారణంగా...లేదండీ'

'—ప్రతిరోజూ.. సత్తువపోతూండటం... ఎంతైనా నీరసించిపోతావు. యిప్పటికే చాలా ముదిరింది, కాని, ఫరవా లేదు, అయితే చాలారోజులు మందు పుచ్చుకోవలసి

ఉంటుంది...' అని శ్రీహారు సలహా చెప్పుతున్నారు. ఆ పిల్లవాడు అమిత ఆదుర్దాతో, అన్నింటికీ తల ఊగించుతూన్నాడు.

'అత్తవారింటికి పంపితే'. . . అని నే నన్నాను. మా డాక్టరు, ఎకసెక్కెంగా నవ్వాడు. ఆ అబ్బాయి, చాలా సిగ్గు పడ్డాడు...

'నీ పేరేమిటి . . బాబూ . . .'

'చంద్రశేఖరం'

'బాగుంది...మరి, నక్షత్రం?'

'రోహిణి...'

'అంటే, ప్రస్తుతం, నీ అభిమాన నక్షత్రం . . . జన్మనక్షత్రంతో . . . మన వైద్యానికి పనిలేదు . . చెప్పు . . . సంకోచించవలసిన అవసరం లేదు. పైగా...చాలా...అవసరం...'

'—మరీ సిగ్గు పడుతున్నాడు; నామాటలకు, డాక్టరు 'వీడికేమన్నా మతిపోయిందా ఏమిటి' అని నావంక చోద్యంగా చూస్తూన్నాడు . . .

'నీవు చెప్పనక్కరలేదులే. నేను కనుక్కో లేకపోయినప్పుడుగదా...' అని నవ్వుతూ, దగ్గరకు వెళ్ళి, అతని జేబులోనుంచి, పర్సుతీసి...తీసి.,. అందులోనుంచి ఆబొమ్మ బయటకు లాగాను... 'మంచి పోజు సంపాదించావు' అని ప్రశంసించి . . . తిరిగి ఎక్కడి వక్కడ పెట్టేసి...అతి శాంతంగా...'డాక్టరుగారు చెప్పినట్లుగా నడుచుకుంటే మూడు నిమిషాల్లో...నీబళ్ళు మళ్ళా. నీవు చెప్పినమాట వింటుంది. ఆయన హస్తాల్లో అశ్వినులు (ఆలోకం ఇవాక్యుయేట్ చేసివచ్చి ప్రస్తుతం టెంపొరరీగా)

కాపురం ఉంటున్నారు. (కుండలీ కరణం, స్వగతంలో జమ) నీ అదృష్టం కొద్దీ దొరికాడనుకో. యింతకూ నీకు బాగుపడే యోగం ఉండబట్టే ఇక్కడకు వచ్చావు. రేపు మంచిది. దుర్ముహూర్తం వెళ్ళగానే, రా. మందు ప్రారంభంచేస్తారు...'

—యింకా. యింకా మాటలతో యిలాగే చక్కిలిగింత బెడుతూ గుమ్మందాకా, ఆతణ్ణి సాగనంపివచ్చి, యథాస్థానంలో కూర్చున్నాను.

'నీ సావాసం కొట్టేస్తానురా. మంచిరోజు చూసి...'అని, బుంగమూతి పెట్టాడు, డాక్టరు.

'మంచిది...ముహూర్తం పెట్టించుకురానా?'

'పోరా...క్వాక్! నీలాంటి స్నేహితుడు ప్రక్కనుంటే ధన్వంతరితాత అయినా... మరునాటికి. . . చదువుకున్నదంతా, మరిచిపోతాడు.'

"—బాగుపడతాడు. ఒరేయి భిషక్! నీరంగు నీళ్ళతో కనుక వాడి ఒళ్ళు నయమైతే. . .యిదిగో యీ కుడిచెవి ఉందిచూడు... సమూలంగా .. నీచేతులమీదుగా ముమ్మారు తెగ్గోయించుకుంటాను...

—భోజనంచేసి, నాదోవను నేను వచ్చేశాను, సంవత్సరాది పండుగపూటా,ఏదో లోపలికిపోయి యిల్లాలితో మాటా మంచీ అడుకునేందుకు లేకుండా, యీ బ్రహ్మచారి పొత్తు ఎందుకని... డాక్టరును విడిచి...

పదిహేను రోజులదాకా... ఊళ్ళో లేను.

—వచ్చిననాడు సాయంకాలము ... పొరుగుపేట వెళ్లి పనిచూసుకుని తిరిగి వస్తూండగా ... ఆపిల్లవాడు, లోపలనుంచి త్రోవను నేను పోతూండటంచూసి... గబగబావచ్చి నన్ను పలుకరించి... వాళ్ళ మేడమీదకు తీసుకువెళ్ళాడు.

యిల్లు చాలాబాగుంది. ఆతనిగది, కలకల లాడుతూంది. బాగా, కలిగిన కుటుంబంలాగా ఉన్నది.

టీ వగయిరాలు, యితర పరికరాలూ, పుష్కలంగా బల్లమీదకు తెప్పించాడు. మొగమాటపడకుండా, మాంచి పట్టుపట్టడంచూసి, ఆతడు, చాలా చనువుగా నాదగ్గిర కూర్చు న్నాడు. నేను కుర్చీలో సమువాల్చి... పొగలో మునిగి, గోడలమీది బొమ్మలవంక... ఒక్కొక్క చిత్రాన్ని ఎంతో నిదానించి... చూస్తున్నాను.

అన్ని మొగాలూ ఒకటే; అవతారాలుమారినా అంతా ఆ అమ్మాయే!

నావంక చూస్తూన్నాడని గమనించకపోలేదు. చూడ నిచ్చాను తీరుబడిగా. చూడటం అంతా అయిపోయిన తరువాత ఆచూపే తెప్పవాల్చకుండా ఆతనిమీదకు మరల్చాను. ము డ లేకపోయినాడు.

-బాగున్నాయ్. అన్నీ బాగున్నాయ్! భలే బాగు న్నాయ్.

—గోడమీద బొమ్మలవంక చూస్తున్నాను. బొమ్మ లను చూసిన చూపులోనే ఆతన్ని చూస్తున్నాను. అన్న మాటే... అంటున్నాను.

'ఏమయ్యా! ఎలా ఉన్నావు!' అన్నాను.

'బాగానే లెండి ...'

—ఆమాటలోఉన్న విసువు, ముందు, కనుకో్కలేక ఉలికిపడి, చెవి తడుముకున్నాను. కాని, ఆతని కవళిక చూసి తెప్పరిల్లి ధైర్యం పైకి కనబడనీయకుండా.

'హుఁ...చాలా సంతోషం. యిప్పుడు యిబ్బందులేమీ లేకుండా రాత్రిళ్లు సుఖంగా నిద్రపోతున్నావన్న మాటేనా?...'

'చూస్తే తెలియడంలేదూ, మీకు...' అన్నది ఆతని చూపు.

అవును, వెనుకటిలాగానే ఉన్నాడు. అంతకన్నాకూడా బుగ్గలు మరీ యీచుకుపోయి నడుంవంగి కళ్లు కళాకాంతులూ లేక . . .

'తెలుసునులే' అన్నట్టు తల ఊగించాను.

'మందు మానేశాను' అన్నాడు, కొంతసేపటికి మాట తెముల్చుకుంటూ.

'మంచిపని చేశావు.'

— నావంక, ఆశ్చర్యంతో చూశాడు. మా స్నేహితుడికి, ఆవచ్చే నాలుగుడబ్బులూ పోయినవని, నాకేమన్నా ఆతని మీద కోపం వస్తుందనుకున్నాడో, ఏమో, నేను ఆశంక ఆతని చూపులలో గ్రహించి ఆమాటనే రెట్టించాను.

'మంచిది యిక వెళ్ళిరానా' అంటూ గడియారంవంక చూసి లేచాను — వీధిలోకి వచ్చాను. నన్ను నాలుగడుగులు సాగనంపే మర్యాదలో, నా వెంటనే నడుస్తున్నాడు.

త్రోవలో ఏదో జ్ఞాపకం వచ్చినట్టుగా ఆగి ఆతనితో 'రేపు విజయనగరం వెళుతున్నాను ... మనకి, ఓ స్నేహితుడి ధర్మమా అంటూ రెండు టిక్కెట్లు ఉల్ ఫాగా వచ్చినవి . . . నీవు కూడా వస్తావా ఏం...సరదాగా, పోయివద్దాం...యిప్పుడు సెలవులేకదా నీకు...' అని అడిగితే, ఆతడు...ఎలాగో తప్పించుకుందామని చూశాడు. కాని...చివరకు ఒప్పించాను. మన నాలుక మీద . . . పంచగ్రహకూటం. .పీఠం వేసుకు కూర్చుండగా...మాటవినక పోవడానికి...మహా మహులకే అలవి కాలేదే . . . ఆ కసుగాయకు, తరమా? —

'మంచి'దంటే, 'మంచి' దనుకుని...ఆతన్ని యింటికి మళ్ళించి... నేను మా డాక్టరు దగ్గరకు వెళ్ళాను...

'ఎప్పుడు ..రాక' అన్నాడు... సోదరుడు...మోటారు సైకిల్ స్టార్టరును, కాలులో సాముచేయిస్తూ... ఎక్కడికో బయలు దేరబోతూ...

"రాకరాక ... నిక్షేపంగా ఒంటి బ్రాహ్మడు ఎదురుగా వస్తే...దిగరా గుర్రం..." అని పలుకరించి, కలిసి లోపలకి వెళ్ళాను...

'ఎప్పు డొచ్చావురా ?...'

'ఎప్పుడు వెళ్ళానో...చెప్పానా?'

'నీ ముఖంలే...'

నా ముఖమేనయం... నీ చేతిమాత్ర పడలేదో...! యింతవరకూ ఏదో యిలా బ్రతికిపోతున్నాను... లేకపోతే నీ

ముఖమే నాముఖం... యింతకన్నా ఉంది...యిప్పుడు మును పటికన్నా లక్షణంగా... ఆ చో్క్రాముఖం...'

'వాడా ... నీకెక్కడ తగిలాడు... అప్పుడే...'

'తగలడం ... పరస్పరం!... మొత్తానికి... నేను అను కున్నంతా అయింది!... పాపం, వాడేమీా నీమీాద చాడీలు చెప్పలేదు కాని... ఎందుకూ, అద్దం ఉంది, ముఖం ఉంది వేరే అడగాలా?...అంతటితో నైనా... దయదలచి వదలావని విని...చాలా సంతోషించి... నీ సౌదర్యాన్ని నీ యెదుటనే వేనోళ్ళ పొగడదామని...హుటాహుటినడలన్ ఇక్కడకు దయ చేశాను...'

'ఒరే...నా శాయశక్తులా... ప్రయత్నంచేసి చూశాను సామ కామోపాయాలతో...'

'భేషో!... ఎవరా కాపు?'

'ఎవరు?...ఎదురుగా ఉన్నవారే... పెళ్ళికూతుళ్ళు'

'ఏ కూతురు...'

'శకుంతల ...'

...అరే... ...డి కర్మంకాలి... చివరకా దీపం సెమ్మెమీాదకా... నీవు తోసింది...'

మిత్రమా! తియ్యని వ్యాధులూ, కమ్మని మందులూ ఉంటాయా? ఎవత్తైతే నేం ..ఔషధం...కళ్ళు మూసుకొని... మింగవలసిందే...'

'తప్పకుండా... యింకా వాడవలసిందే యీా పాటికి అనంతరం బో డేవా?...

'ఆ దేవుడు . . . అప్పటి నుంచీ . . . అసలు ముఖం తప్పించాడు. . ఇదిగో. . . ఇక రెండు రోజులు చూసి . . . బిల్లు పంపించుతాను. కందకు లేని దురద, చామ కెందుకు, మధ్య ?—'

'—చామకు, దురదంటూ రేగాలిగాని . . . అప్పుడు కంద, మందులోకైనా పనికిరాదు. . . బిల్లు ఎక్కడికీ పోదు గాని, యింకో పదిరోజులు పోనీ... అంతలో పాపం పెరిగినట్టు యింకా పెరుగుతుంది. . .'

"ఎవరిపాపం?"

'— పాపం పోనీ అని... దయదలచి, మీకు బిల్లులు చెల్లించే వాళ్ళది...'

"చెల్లించడం పాపమో పుణ్యమో, ఆదైనా నీలాటి సైంధవులు అడ్డుపడకుండా ఉంటేనే...'

'అడ్డుపడటం చేతనైతేనే. . . తలంచుకుంటే ఎవరైనా ఒడ్డు ఎక్కించ గలిగేది. . .'

టెన్నిసుకు వెళ్ళిపోయినాడు.

మూడోనాడు సాయంకాలము.... నేనూ చంద్రశేఖరం... విజయనగరంలో ఉన్నాము....

'ఎక్కడికి వెళదాం?' అన్నాను. స్టేషను నుంచి ఊళ్ళోకి వెళుతూ.

'మీ యిష్టం.' అన్నాడు.

'నా యిష్టం... నీకు యిష్టమైతే...'

—యింతలో నాకు ముఖ్యుడైన స్నేహితు డొకడు తగిలి. . . మరునాడు మధ్యాహ్నం దాక . . . రాజోపచారా లతో. . . ఆతని యింటిలో మమ్మల్ని యిద్దరినీ ఖైదు చేసి. . . కాలక్షేపాలలో ఎక్కడికీ తెమిలి కదల నిచ్చాడు కాదు.

. . . బట్టలు వేసుకు, నేను బయలుదేరుతున్నాను. ‹నేను కూడా రానా ?' అని. . . మొగమాట పడుతూ అడి గాడు శేఖరం : రమ్మని తల ఊగించి. . . బండిలోకి ఎక్క బోతూండగా. . . ‹ఎక్కడికి ?' అని మళ్లా అడిగాడు. . .

‹ఒకటి, బయలుదేర బోతూన్నప్పుడు బొట్టూకాటుకా పెట్టి పిలిస్తేనే కాని కదలకపోవడం, వెళ్ళబోతూ 'ఎక్కడి' కనడం . . . రెండూ మంచి శకునాలే. . . శుభ సూచనలు ముందే కనబడుతున్నవి-' అంటూ విసువుతో మంటగా కసిరాను.

'తెలియక అన్నానండీ' . . . ఆతనికి, కళ్లనీళ్ళ పర్యంత మయినది.

తెలిసో, తెలియకో యిప్పుడు అనుకునిమాత్రం, ఏం లాభం? — ఎటైనా, . . . నీ మంచికోసమే కాని . . .'

నేనన్నది . . . అతనికి ఏలా అర్థం అయిందా? నావంక, చూసి, మాటాడకుండా, బండిలో యింకా పైకిపోయి కూర్చు న్నాడు.

అమాయకత్వం చూస్తే . . . జాలి వేసింది. బుజ్జగిం పుగా . . . మనం ఎక్కడికి వెలుతున్నామో తెలుసునా? అని మాటలు ప్రారంభం చేశాను.

అతడు తల ఎత్తి చూసి . . . ఊరుకున్నాడు.

"మనం వెళ్ళేది. . , అక్కడికే . . ."

"ఎక్కడి"కని. . . తల ఊగించాడు.

నేను కొంచెం నవ్వుగా. . . "ఆ అమ్మాయిని, యిది వరకు ఏన్నడన్నా చూశావా? . . .తెరమీదా. . .కలల్లోనూ కాదు, నేననేది. . .మనిషి. . . నిండుసిలువు"

వింటూ చిరునవ్వు నవ్వాడు . . చివర అన్న మాటికి. . , చిన్న పుచ్చుకున్నాడు. నేను. . .చేత అంకుశం అప్పుడప్పుడే, వదలదలచుకోలేదు.

"అసలు. . .ఆ పిల్లది యీ ఊరేనన్న సంగతైనా తెలుసునా? — తెలియదూ?. . .ఎవరినన్నా అడగలేకపోయినావా? . . .యే సినిమా పత్రికవాళ్ళకి వ్రాసినా, మరునాటికి జవాబు వచ్చేదే. . .పోనీ కేరాఫ్‌వారి కంపెనీకే ఉత్తరం వ్రాయకపోయినావూ? . . .మూడోనాటికి ముత్యాలలాటి అక్షరాలతో సంతకమై ముద్దొచ్చే బొమ్మవచ్చేదే? దానికి మంచి ఫ్రేము వేయించినా అందమూ, చందమూ, కాని, అచ్చు అయి కాగితాలలోనుంచి కత్తిరించి. . . గోడకు అతికించుతే—ఏం ఫలం? . . .ఊఁ. . .మంచిదాని మీద నేకన్ను వేసావులే. . .చిదిపి దీపం పెట్టవచ్చును. పైపూతలవల్ల వచ్చిన కళ కాదది. . .అసలు పిల్లది, మెరిసిపోతూ ఉంటుంది. . .చూస్తావుకా. . .?

ఆతనిని. . .కనిపెడుతూనే ఉన్నాను. నా మాటలతో గిలిగింతలై. . .పిల్లవాడు లోలోపల కిలకిలలాడ పోవడం. . .కళ్ల మెరపులో. . .ఉబలాటం దాచుకోగలిగినంత రాయడా ఏం?—

—..ఎండ మండిపోతూన్నది. గుమ్మంలోనే బండిదిగి... అతని చేయి విడవకుండా పట్టుకుని లోపలికి ప్రవేశించి ..ఎదురుగా ఎవరూ కనబడకపోతే...మనరాక తెలిసేందుకు ..గొంతు సవరించుకున్నాను.

పక్కవసారా వేపునుంచి . . . తలుపు తీసుకుని . . . వాళ్ళ అమ్మ. .తలుపులు వేసుకు పడుకున్నది కాబోలు చీకటిలోంచి వెలుతురులోకి రావడంలో, చూపు అనడానికి కళ్ళు చికిలించుకుంటూ... చూసి పోల్చుకుని... దగ్గరకు వస్తూ...'త్రోవతప్పి వచ్చారులాగుంది...' అంటూ పళ్ళే మంత ముఖం చేసుకుని... మాకున్న స్నేహాన సరసమాడి... చేతులో ఉన్న విసనకర్ర... అందించింది. కూర్చున్నాము...

'దాహం కావాలా ?'

'ఎంత త్రాగినా... దాహం తీరుతుంది గనకనా'

'పోదురూ... మీకు... తల నెరిసినా, యింకాచిన్నతనమే...' అని మరీ చొరవగా మాట రానిచ్చి... నాలుక కొన పంటితో నొక్కుతూ... సంకోచంతో... "వీ రెవరు?' అని శేఖరాన్ని సూచించింది...

'ఎవరైతేనేం... నాతో వచ్చినప్పుడు... నా అంత వారన్నమాటే కాదూ..."

'నూరు ఆరైనా... మీ అంతవారు మీరే...అందరి కన్నా... అయిదాకు ఎక్కువ చదివితిరి!, ..'

'మన చదువు ఇతరులకు ఒంట పట్టింది, కాని. . .'— యీ ముసలి సరసాలకి అంతు అంటూ ఎప్పటికి ఉండేదో కాని యింతలో. . . అవతలనుంచి. . . 'ఎవరే అమ్మా!—' అను కుంటూ, ఆ అమ్మాయి. . . గుమ్మంలోకి లోపలనుంచివచ్చి అక్కడే ఆగి. . . నన్ను చూసి. . . ఏనుగనెక్కినంత సంతోషంగా . . చంద్ర బింబంగా ముఖం చేసుకుంది. . .

శేఖరం కళ్ళకు. . . ఆ అమ్మాయి కనబడటం. .

ముఖమంతా నీళ్ళు కారుతూన్నవి. . . లో దుక్కున్న బాడీ తడిసి ఒంటికంటుకున్నది . . ఒళ్ళూ ముఖమూ సూది మొనమోపే సందు లేకుండా. . . పేలి, కందగడ్డలాగా. . . బాడీ, విప్పకుండానే. . . వీలయినంతవరకూ వీపుమీద, మెడదాకా ఎగసన దోసుకుని. . . దువ్వెనతో, చేయి వెనుకకు మెలివేసి గోక్కుంటూ. . . దురదలో హెచ్చుతగ్గుల తికమకలు ముఖ కవలికలో. . . పెదవి విరుపుల్లో ప్రకటించుతూ. . . తలంటి పోసుకున్న జుట్టు. . . పైనంతా రేగి . . . అలకలు కళ్ళదాకా అంటుకుని. . . చెవులూ ముక్కు. . . బోసిగా. . .

—అదీ. . .చూడటం శేఖరం. . .సుభద్రా కుమారిని

'రా...సుబ్బులూ! యిక్కడ పరాయివాళ్ళెవరూ లేరులే! యీ అబ్బాయి, నిన్ను చూడాలని మా ఊరునుంచి గంపె డాశతో, వచ్చాడు. ఆస పెట్టింది నేనేననుకో. ప్రొద్యూసర్లను ముప్పతిప్పలా పెట్టి మూడు చెరువుల నీళ్ళు త్రాగించుతూ, ఎక్కడో కొమ్మెక్కి కూర్చున్న ప్రసిద్ధ తారను మనం సంద

ర్శించ వీలవుతుందా?, అని యీతడు నిరాశ చేసికున్నాడు. కాని. . . నేను, "మరేంమునిగిపోలేదయ్యా! యిప్పుడంటే యిలా ఆకాశానికి అంటిందికాని సుబ్బులు నా కళ్ళముందర పిల్ల కాదూ పరికిణీ కట్టుకోకుండా నా ముందర తిరిగేదే. దానిల్లు బంగారంగానూ, యిప్పుడింత యిదైనా మనం వెళితే ఆమాత్రం దరిశనమైనా యివ్వదా! ఏం చూదాముగా? అని హామీ యిచ్చి తీసుకువచ్చాను. రా వచ్చి యిలాకూర్చో. యింటికివచ్చిన పెద్దమనుషులకు మరియాద చేయడం...ఎంకావాలో, పళ్ళో, పాలో ఏమీ కనుక్కోకుండా యింకా చిన్నతనమేనా? పెద్దగా పేరుప్రఖ్యాతి. . .'

సుబ్బులు...సినీమా నడకతో వచ్చి శేఖరం బారున కూర్చున్నది. ఆతడు కూర్చున్నచోట, ఆమె ఎక్కడ తగులుతుందో అని ఒళ్ళు కుదించుకున్నాడు, నేను నవ్వు ఆపుకున్నాను.

"ఎంతపేరుమోగినా అదంతా మీ చలువే. దానికి యింకా నేర్చుకోవాలీ యింకా బాగా పైకి రావాలీ, అని ఎప్పుడు అదే ఒకటే ధోరణి కాని అందరిలాగా నిక్కునీలుగులూ నేర్చిన పిల్లకాదండీ అయినామీరు ఎరుగని దున్నది కనుకనా? అని తల్లి అందుకున్నది: "అవునులే—అబ్బే! దానికవేమీ లేవు నేనెరుగను గనుకనా" యీ, లాటి అతుకు మాటలు; నడుమనడుమ విసురుతూ మాటకు అడ్డంవచ్చి. . ,

"మళ్ళా ఎక్కడా బుక్ కాలేదా?" అని ఆ అమ్మాయిని పలుకరించాను. సుబ్బులు తల్లివంక చూసింది.

'-వీళ్ళకు సమాధానాలు చెప్పలేక నాపని అవుతున్న దండీ... ఏ పూట కాపూట ఎవరో ఒకరు రావడం...ఎం తైనా యిస్తాం పిల్లదాన్ని పంపించాలి అని ప్రాణాలుతీయడం... తెరమీద ఎక్కి-ఏదో తైతక్కలాడి రావడమా కావలసింది మనకు ? ... దానికి ఎవరు బడితే వాళ్ళు తయారు: మనకు డబ్బే ప్రధానం కాదుకదా!— ఏదో ... మంచి చోటుచూసి... అన్నీ కలిసివచ్చేటట్టుగా ఉంటేనే గాని ... అమ్మాయి యీ మారు కదల నంటూంది . . . దాని అవసరం ఉంటే — దాని కాళ్ళ దగ్గరకే వస్తారు ... వచ్చారో ... దేశాన్ని దోచు కున్నారో ! అమ్మాయి పేరు చెపితేనే ... కనక వర్షం కురు స్తుంది ... ఎవ రెరుగరు గనుక ?—' (... అన్నింటికీ తల ఊగించడమే తప్ప, జవాబు చెప్పడానికి అందులో ఏమున్నదీ ? ఎవరిని కదిలించినా వచ్చేది ఆపాఠమే !... ఎవ రెరుగరు ?—)

—రాచకార్యం అయిపోయింది . . . కాఫీ . . .గీఫీ . . . ఎండకూడా, చల్ల బడుతుంది:

'వెళ్ళి—వస్తాను . . .

'అప్పుడేనా . . .' అన్నది, తల్లి. ఈపూటేనా' అన్నది, కూతురు . . .

'—ఎన్నాళ్ళున్నా మీయింట్లో, ఎప్పటి కప్పుడు పర గడుపే . . . అని తల్లి వేపు చూసి నవ్వి . . . సుబ్బులతో —'అవును. నేను . . . యీవాళ బండికి వెళ్ళుతాను, మరి, యీ పిల్లవాడు . . . నాలుగు రోజుల పాటు యిక్కడ ఉంటాడు... మీకు తీరుబడిగా ఉన్నప్పుడు, చూసిపోవడానికి...వస్తాడు...'

అని, ‹రావడం నీకు యిష్టమేనా ?' అని చూపులతో ప్రశ్న వేశాను . . .

—తల్లి నవ్వింది : సుబ్బులు కిలకిలలాడుతూ, అల్లరి పిల్లవాడిని బెదరించటం లాగా. . . నావేపుకు చేయి విసిరింది; నేను దూరం కావడంచేత తడవ లేదు కాని, శేఖరం ముఖం నిండా. . . చేతిచెమ్మట. . . ఒత్తుగా జల్లుకుంది.

—‹ఉండే నాలుగు రోజులూ . . . యిక్కడే ఉండమనండి: . . ఏమీ లోపం చేయముకదా . . . మాకు కలిగిన దాంట్లో. . .' అని అన్నది. . .తల్లి. . .

నేను శేఖరంవంక చూశాను; అందు కత డేమంటాడో అని; —'నేనూ బయలుదేరుతానండీ. . . మీతోనే .. యింటి దగ్గిర మా అమ్మ బెంగపెట్టుకుంటుంది ..'అని, నాకన్న ముందుగా లేచి నిలుచుని వీధివేపు దోవతీశాడు. . .

'యీ. . .ఊరు బాగుండలేదు కాబోలు, ఆ అబ్బాయికి . . .'అని యీసడింపుతో అన్నది తల్లి. సుబ్బులు నవ్వుతూ. . . క్రింద చతికిలపడి కూర్చుని. . . కుచ్చెళ్లు మోకాళ్ళపైకి లాగి . . . దువ్వెన పెద్దపళ్ళతో . . .చర్మం గీరుకుపోయేటట్టుగా గోక్కుంటూ . . .యికిలిస్తూ. . .

తల్లి, గుమ్మందాకా నన్ను సాగనంపటానికి వచ్చింది; శేఖరం అప్పుడే త్రోవను పోయే ఏదో బండి ఆపి అందులో ఎక్కి కూర్చుని. . . ముందునుంచి. . . నన్ను తొందరపెడుతూ తొంగిచూసి, రమ్మని తలఊగించాడు. గుర్రం బెదిరినట్టుగా. . . బండి పరుగెత్తుతూంది. శేఖరం, పరధ్యానంతో, మాటాడకుండా

. . .ఎక్కడో చూస్తున్నాడు. . .నాకో, నేను మాటాడుకుం టున్నాను —

—'నయమే . . .సుబ్బులు ఒళ్లు నిరుటిలాగా పేలలేదు. పాపం క్రిందటి వేసంగికి . . .ఎక్కడబడితే అక్కడ సెగ్గడలు. . . కళ్లూ ముఖమూ వాచిపోయి. . .ఒంటి చీర నిండా నెత్తురు డాగులూ . . . అసలు ఒంటిమీద గుడ్డఅయినా నిలిచిందా. . . చూసేవాళ్ళకే రోతపుడితే. . . దాని కది యింకా యెంత బాధపడిఉండాలి?—

'యింతకూ దానిననడం దోషం. . .తల్లి చెరిపేసింది. . . బొడ్డూడక ముందునుంచీ . . . చుట్టకాల్చడం . . . నల్లమందు వేయడం నేర్పితే. . .అవి అందరికీ పడతాయా: అవిఅయినా, పోనీ, రోజుకు ఏ ఒకటో రెండో అయితే అనుకోవచ్చును. . . మూరెడూ బారెడూ. . .మగవాళ్ళకన్న ఎక్కువగా రోజల్లా ఒహాటే తగలేయడం. . .కుంకుడుకాయలంత ఉండలు మింగడం . . .ఏమన్నాఅంటే. . .యీదేశంవాళ్లకు యింతే, మీకు తెలి యకపోతే చూస్తూ ఊరుకోండి. . .చేతనైతే మీరూ. . .మొద లెట్టండి. . .' అని మంచిగా, 'తగదు' అని బుద్ధిచెప్పబోతే . . . నామీదికి రయ్‌మని లేస్తుంది ఆతల్లి. ఇంకా కొంత మెరుగు కాదూ .. అందరిమీదలాగా . . .నామీద, ఆతల్లీకూతురూ విరుచుకుపడి . . . బూతులకు రేగితే. . . వాళ్ళముందు ఎవడు నిలువగలడు ? —వాళ్లనోటికి ఎవరు సమాధానం చెప్పకలరు?—

'సరే. . .యిప్పుడు పులిమీది పుట్రగా కొత్త ఎద్దడి కూడా వచ్చిపడిందా! . . . ఏంలక్షణంగానన్నా ఉంది. . . యిది . . .

దీనికి పుట్టిన తెగులేకాని... సినిమాల్లో వేషాలు వేశే వాళ్ళందరూ ...ఆలా ఒళ్ళు తెలియకుండా తాగు తారా ?— అలా అయితే ఎంత సంపాదించినా ఆగుతుందా ?...

'ఏమిటో...వీళ్ళని తలచడంకూడా పాపమే అనిపిస్తుంది ఒకొ్కక్కప్పుడు. ఆలా అనుకుని మానేస్తున్నామా ? దాలిగుంటలో కుక్కలాగా...అప్పుడలా అనుకోవడమే కాని ... తరువాత, బుద్ధి, మళ్లా దానంతట అది గడ్డితింటూనే ఉంటుంది... ఏమిటో...యీ బ్రతుకు... యిందులో, యిన్ని ... అతుకులూ ''

—అర్థంలేకుండా... అసందర్భంగా ... అడ్డదిడ్డంగా ... కొన్ని అబద్ధాలు...బండిదిగేదాకా... విడవకుండా, ఆతనికి వినబడుతూండేట్టుగా...నాలో నేను గంద్రగోళం చేసేశాను. రైలు ఎక్కి ... ఊళ్లోదిగి... ఎవరి త్రోవను వారు యిళ్లకు వెళ్లిపోయినాము.

— నెల్లాళ్ళకు :

... తెరమీాద ... ఆతని పోలికఉన్న బొమ్మ చూసి... డాక్టరుకు శేఖరంమాట జ్ఞాపకంవచ్చింది. 'పుచ్చుకున్నాళ్ళు - పుచ్చుకుని, అజాపజా తెలియకుండా పోయినాడు చూడరా, వాడు; యీ పాటికి మంచం ఎక్కిఉంటాడులే'... అని అక్కసుతో మాటాడాడు.—'అవునోయ్! దేవర ఔషధమే సేవిస్తూంటే... యిప్పటికి, నీవన్నంతపనీ తప్పకుండా

అయేది. . .' అన్నాను. . . డాక్టరుకు, త్రాగుతూన్న, సోడా. . .
. . . రోషంమీద కొరమారి. . . ముక్కుల్లోంచి, నోటినుంచీ త్రాగినదంతా గళబిళగా. . . ఉమ్మివేశాడు. . .రోజాడు.

గేటుబయటికి వచ్చాము. . . శేఖరం, సైకిలుమీద ఎక్కబోతున్నాడు. . . నన్ను చూచి. . . ఆగి, దగ్గిరకువచ్చాడు. డాక్టరు. . . అతని అభివాదము పెడమొగంతో కొంచెం నిక్కుగా అందుకున్నాడు . . .

'ఏమోయ్. . . ఏలా ఉన్నావు ?' అన్నాను. . .

'కులాసాగా ఉన్నానండీ . . . మీదర్శనానికి రావాలనే అనుకుంటూన్నాను. . . టెన్నిస్ మాచెస్‌కు వెళ్ళి నిన్ననే వచ్చాను. . . అందుచేత. . .'

' . . . సరే, . . . రేపు కలుసుకుందాము, తీరికగా . . . డాక్టరుగారియింట్లో. . .' అని అతన్ని పంపించి వేశాను.

'ఏరా. . , మంచం ఎక్కడానికి బదులు. . . సైకిలెక్కి ఝుమాయించి పోతున్నాడే. . . ఏమిటీ మిరకిల్. . .' అని నిల వేశాను, డాక్టరును. గుక్కతిప్పుకోలేక పోయినాడు.

'ఏలా ఉన్నాడు యిప్పుడు ?—'

డాక్టరు నీరసంగా . . . 'బాగానే ఉన్నాడ'ని. . . ఉ సూరుమన్నాడు.

'ఎందుచేత. . . ఏలా ?. . . నీమందే పనిచేసిందంటావా, నీకే నమ్మకంలేకపోయినా: నీకన్న గొప్పవాడు చేపట్టి. . . కుదిర్చాడంటావా ? . . .'డాక్టరుకు. . . అన్నీ గొంతున పడ్డవి.

‘పోరా... ఎవరికర్మం వారిది ... ఎంతచేసినా ... ఎవరికో యింకొకరికామాట దక్కుతుంది!’ అన్నాడు నిర్వేదంతో... యింటికివెళ్లి నడుం వాల్చిన తరువాత.

మీకు మాట దక్కితే చాలునుగా; ఏంరామరి, రేపు, వాడు ఫీజు తీసుకువచ్చి యిస్తాడుగాని, మరియాదగా పుచ్చుకుని .. ఏసవాతనుల సభకైనా ధర్మం చేయి...’

‘ఏం’ అని తల ఊగించాడు డాక్టరు...

‘మెదడును ఏమాత్రం వాడనిజాతి, మీ తరువాత అది ఒక్కటే...’

‘డిఫర్ మేషక...’

—కాదోయ్! ‘డి’ కాదు ‘రి’ ఉన్నమాట ముఖంమీద నే ఒకసారికి పదిసారులు అనేస్తే... ఉలికి... లేకపోతే, ఏమిటిరా యింతవరకూ మీరుచేస్తున్న నిర్వాకం?... గడియారం యెడమచేతిలోలేందీ ... నాడి చూడలేరు: చూచినా ... ఒంట్లో ఏలావున్నదీ.. .జబ్బుఏమిటో, రోగి... మీకు పాఠం చెపితేనేకాని అర్థం చేసికోలేరు. యిందులో, యీ సర్వజ్ఞత్వానికి తోడు... నాలుగుసార్లు తొందరగా అటూఇటూ తిరగడం... అవతల వాడిన కసరడం... అసలే వాడు ఎంతో ఆదుర్దాతో, ఏదో ఉద్ధరిస్తారుకదా అనివస్తే ... మీ హంగా మాకూ భేషజానికి. . .నిజంగా, ఖాయిలా వచ్చేట్టుగా చేస్తారు తరువాత... కుదిరేభారం భగవంతుని అనుగ్రహంమీద... వాళ్లువాళ్లు చేసికున్న... కర్మమీద...

‘అయితే.., యిక మేమెందుకూ?’

‘అదేరా నేను యిందాకటినుంచీ వేస్తున్న ప్రశ్న, భాయీ అంటే కోపంకాని. . . నీమటుకు నీవేంచేస్తున్నావు చెప్పు ?. . . యింట్లో ఎవరికైనా జబ్బుచేస్తే ఏడుకొండలవాడికి మ్రొక్కు కోవడం. . . ముడుపు కట్టడం. . . తాయెతులు కట్టించడం. . . విభూతి పెట్టించడం . . . దొడ్డివసారాలో, రంగాచార్యులు కూర్చుని కలవంలో నూరించి మాత్రలుకట్టి యివ్వడం . . మీదా కా వచ్చినప్పుడు. . అంతే యితరులకైతే. . యిన్నిరంగు నీళ్లు . .

‘ఎక్కడనుంచి. . . ఎక్కడకు తీస్తున్నావు . . . నీ వనే మాట ఒకటైనా సబబుగా ఉందా ? . . .

‘—ఉండదు. . . ఉంటే నీ కర్థమౌతుందా ? ఎందుయ్‌కో యింకా మోరాయింపు ?. . . శేఖరం సంగతి ఏమిటి చెప్పు...’

‘నాకు తెలియదంటున్నావుగా. . . నీవే చెప్పు. . .’

అంతా వివరంగా, ఆతడికి అర్థమయ్యేట్టు చెప్పాను. . .

. . ‘వయసువస్తున్న కుర్రవాళ్ళకు . . . సాధారణంగా ఎవరికో ఒకరికి తప్ప. . . అలా తప్పని సరిగా. . . తెలియకుండా నడుముసడలు తూండటం. . . సరే. . .

‘యిక్కడ ఏం వచ్చిందంటే. . . మనసులో ఆ అమ్మాయిని నిలుపుకుని, తరువాత, అసహ్యమే అయినా, అందు లోనూ ఏదో తృప్తి పొందుతున్నాడు. . . వాంఛతో వృద్ధి రించుకున్న వ్యాధి. . అరికట్ట డానికి ఆతని ఆ తత్వానికి అలవి కానిదై పోయింది. . .

‘అది తెలియక, నీవద్దకు వచ్చాడు. నీకూ అంతతెలివి లేకపోయింది. సామాన్య విధానాలన్నీ, అతనిమీద ఉపయో

గించి చూశావు. సంసారం చేయించావు. . . కాని శకుంతలనే కాదు, సుబ్బులును తీసుకువచ్చి వాడికిఅంటకట్టినా. . .మనము అసలు దానిని ఏమీ అరికట్టకలిగే వాళ్ళముకాము.

'మనసులో బొమ్మను. . .మనసుచేతనే చెరిపేయించాలి. మనసుకు రోషం ఎక్కితే. . .మనచేతకాని ఘనకార్యం . . . సమూలంగా. . .నిమిషంలో, అది చేసేస్తుంది.

'శేఖరం. . .అవాళనుంచే బాగుపడింది. . .

'అన్నీ అలా ఒనగూడటంకాదు. . .నేను ఆలోచించి. . తెలివిమీద చేసినపనే అది. . .సుబ్బులు. మండువేసగిలో మిట్ట మధ్యాహ్నం . .అంత అసహ్యంగాను ఉంటుందన్న సంగతి నాకు తెలిసినదే . . . నేను అనుకున్నంత భీభత్సంగా లేకపోనా. .రోహిణి ముదరలేదుగా . .అదే వాడికి తల మున్కలైంది.

'ఆదెబ్బకు. . .దిమ్మ తిరిగిపోయి. . .సరిఅయిన ధోరణికి . . .తనంతట తానే మళ్ళాడు. ఎప్పటికి యిలాటి జబ్బు పడడు. కర్మంచాలక. . .ఒకవేళ పడే సందర్భమేఅంటూ వచ్చినా. . . మీ సేవ చేయడానికి రాడు. . .

—డాక్టరు. . .సిగ్గులేకుండా . . . నవ్వుతూ 'యిప్పటికి నీ మనసు చల్లబడిందా. . .' అన్నాడు . . . వెక్కిరించాడు. . .

. . .మరునాడు ఎదురుగుండా మేడమీద. . .గ్రామఫోను మోతలో గొంతులు కలిపి. . .శకుంతల, 'చ-ల్లా నా-యే-నూ-లేరా. . .నాసామి మువ్వగోపాళా. . .' ఘనా జటాగా పాడు తూన్నది; క్రింద, మనోహరం . . . ఎవరిమీదనో, రోజుకన్న ఎక్కువగా అరుస్తున్నది. . .

(4)

# సర్వమంగళ

నిన్ను వెదుక్కుంటూ వచ్చానమ్మా!

—ఇంతదూరం, ఎక్కడో కృష్ణాతీరాన్నుంచి. . . చల్లని తల్లివి, కష్టాలన్నీ విని, కడుపులో పెట్టుకు ఆదుకుంటావని, నీలో కలిసిపోదామని వచ్చానమ్మా!

. . . సహించారు; మనసులో ఎంత అసహ్యపడుతూన్నా, బయటికి కనబరచకుండా, ఆదరంతో చూస్తూ, తమ ఔదార్యాన్ని ప్రకటించుకుని, లోకంచేత 'ఆహా' అనిపించుకుని, కోటియజ్ఞాలఫలం దక్కినట్టు, మురిసిపోయినారు ; కాని, అర్థంచేసుకుని, అనుతాపంలో పాలుపంచుకోలేని, ఈ లోకానికి. . . ఎంతదూరమైపోతే మాత్రం ఏ మమ్మా.

నావాళ్లే నాకు కానివాళ్లైనప్పుడు. . . పంచప్రాణాలూ, మమకారం, నిల్పినవాళ్లే, వంచనచేసి తూలనాడినప్పుడు . . . కోరికలు, ఇక ఈ జన్మకు తీరవనే నిరాశ కుదురుకు పోయిన తరువాత. . . బ్రతికి మాత్రం ఫల మే మున్నదమ్మా !

తీరా. . . ఇకఎన్నటికీ కనపడనని తేలిపోయినతరువాత . . . అన్నయ్య, పాపం, తల్లీ తోడూ కనుక . . . విచారపడతాడు. నా జీవితం అంతా అడవినికాచిన వెన్నెల అయిపోయినప్పటికీ . . . నా బాధలన్నీ నేను భరించుకుంటూ, ఇంట్లో చేదోడువాదోడుగా ఉండి, అక్కరకు అడ్డుపడుతూన్నన్ని నాళ్లూ, ఆయనకేమీ చీమంత ఐనా, నా గొడవ పట్టలేదు; ఇప్పుడు మాత్రం, ఇబ్బంది

వచ్చినప్పుడు, ఆదుకునేందుకు మనిషి లేకపోయింది కదా అని నన్ను తలుచుకుంటాడేమో; అయినా ఎంతసేపులే . . . వదిన కౌగిలిలోకి వెళ్ళిపోయినతరువాత, లోకాన్నే మరచిపోతాడు.

మాచెల్లెలు, జానకా, అభం శుభం దానికి ఏం తెలుసు దానిపెనిమిటి నాకు చేసిన అపకారం. . . కాదు, ఉపకారం... దానికి తెలిస్తే ... ఓర్చుకుని, భరించగల జాణతనం.. ఆ అమాయకురాలికి, పసిపాపకు... ఏదమ్మా!

"వయస్సు మళ్ళుతూన్న వాడు ... కొరక రాని కొరివి... ఆ నికృష్టుడికి, బంగారంవంటి పండుతల్లిని కట్టి పెట్టవద్దు.. ఇది సుతరామూ కూడదు... రెండో పెళ్ళివాడితో అది బావుకు నేది ఏమిటి"అని నేను పట్టుపట్టి, ఆసంబంధం మానిపించాలని, శాయశక్తులా అన్నయ్యతో పోరుపెట్టాను; కాని నామాట విం టాడా? పిల్ల సుఖపడుతుందట!... ఆమాటకు అర్థం ఉన్నదా ఆడది సుఖపడటం అంటే ఏమిటో, ఆ మొగరాయుడుకు తెలు సునా? ముద్దినను నగలూ చీరెలూ, ఇనపపెట్టెలో నిండు సంచులూ చూసుకుంటే కడుపు నిండిపోతుందా?...పైగా, నేను ఇంకా ఏమన్నా అనిపోతానేమోనని...'మొదటి పెళ్ళి వాడని పిల్లవాడు చిన్నవాడని, లక్షణమయినవాడని...నిన్ను ఇస్తే ... ఏమైంది చెప్పు... ఆయుర్దాయం ఉండాలి, సుఖపడి అనుభవించే యోగం ఉండాలికాని' . ఈ మాటకు నానోరు కట్టుపడింది...మనసు చిల్లులుపడిపోతే మాత్రం ... అతనికేం?

— మూడుముళ్ళూ పడ్డాయి. పడ్డ ఆరుమాసాలకే పిల్ల ఈడేరింది. పడసారం, పదమూడో ఏడు సగపాలైనా గడవలేదు

పిల్ల ఏపరికాదు. కాకపోతేనేం, మూడుముచ్చట్లూ తీరినతరు వాత, ఒక్క క్షణం ఉండనిచ్చాడా పిల్లను నట్టింట! గద్ద తన్నుకు పోయినట్టే నేను మళ్ళా నోరుచేసుకున్నాను అప్పుడు కూడా... అన్నయ్యతో, నెమ్మదిగా .. 'ఇంకోసంవత్సరమన్నా ఆగితే మంచిదని బావగారితో ఏలాగైనా చెప్పి ఒప్పించు; పిల్ల కొంచెం పెద్దదైతే కాని, ఇప్పటినుంచీ కాపురం ఏం దిద్దుకుంటుంది. ఇంకో దిక్కు లేదు, వంటరిగా ఉంటాను...' అని బ్రతిమాలుకున్నాను. అన్నయ్యకే ఈ ఊహ తట్టవలసింది... పోనీ, విన్నైనా హర్షించడా అనుకుంటే, ఆలా కాకపోగా, పై పెచ్చు ఎదురు తిరిగి...'ఎంతకాలం నోట్లో వేలు వేసుకు కూర్చుంటా డనుకుంటావు? ఆడదిక్కు లేకనే' గూట దీపం పెట్టేవాళ్ళు లేకనేగా... వెంటనే పెళ్ళి చేసు కుంది... ఏం, తీపెళ్ళిందా ఏం... దానికేదుకు నేను అమ్మకు కడుపున పడ్డానుట...ఇంకా, ఆయన పుణ్యామా అంటూ మంచి వాడు కనుక, ఇంతకాలం ఆపాడు. మనం చూడటం లేదూ, లోకంలో... వెంటనే... పసుపుబట్టలతోనే తీసుకు వెళ్ళి కాపు రం పెట్టుకున్నవాళ్ళు ఎంతమంది లేరు?— ఆలా చేస్తేమాత్రం వద్దనగలిగే వాళ్ళమా? నీమాటల కేంలే? నట్టింట కనబడు తూన్నన్నాళ్ళూ ..ఎంత వయసు వచ్చినా, మనకు పసిపిల్లే .. అవతలవాళ్ళ కష్టసుఖాలుకూడా కొంచెం యోచించవద్దూ ..' అంటూ నన్ను గదమాయించి, బావమరదిని వెనక వేసుకు వచ్చాడు. నేను అనేదేముందీ ఇక... అన్నింటికీ తల ఊప వలసినదాన్నేనాయెను! పోనీ, చెప్పిచూసేవా ళ్ళెవరైనా ఉన్నా

రాలంటే, ఇరుగా పొరుగూ.. నా అన్నవారు లేరు. ఇటు మా అన్నయ్యా...అటు మా జానకి మొగుడు పూర్ణయ్య శాస్త్రుర్లూ .. ఎవరియింటికి వారే పెద్దలు!

సరే, ఆ కాస్త ముక్కూ కూడా తీరిపోయింది. గది అలంకారాలన్నీ ఇరుగమ్మా, పొరుగమ్మా ఎవరో చేయిచేసు కుని కానిచ్చేశారు. నాకు, ఒకమారి తొంగిచూడ్డానికైనా మనసు ఒప్పలేదు. పిండివంటదగ్గర కూర్చున్నంతసేపూ, కంట నీరు పెడుతూనే ఉన్నాను. పొగపోయి కళ్ళు ఎర్రవారిన వను కున్నారు... పేరంటాళ్ళు. మనసు ఎంత కుమిలిపోతూన్నదో ఎవరూ గ్రహించలేదు .. నయమే అదీని!

ఇక... ఆ కాపురం ముచ్చట్లు ఏమని చెప్పేది! మూడు నిద్దరూ కాగానే, తెల్లవారితే మంగళవారమయిన, నిమిషం నిల వకుండా తర్లించుకు వెళ్ళిపోయినాడు ... తీసుకువెళ్ళి కత్తుల బోనులో ఇరికించాడు. మెదలడానికి వీలులేదు. కూరనార అమ్మేవాళ్ళతోనే నా మాట్లాడకూడదు. నుగపురుగుకంట బడ రాదు .. మా పక్క వీధిలోనే ఉన్నా ... మళ్ళా గడపతొక్క నీయలేదు: ప్రాణాలన్నీ దాని మీదే పెట్టుకుని ఉన్నా...పోయి ఒకమారు కంటనైనా చూద్దామంటే, నాకు అసలు పారా గత్తెం ఉందీ?- ఇక, బండిలో కాలు పెట్టబోతూ, నేను మడి గట్టుకుని ఊరగాయలు సర్దుతూంటే, బెదురుకుంటూవచ్చి, నన్ను కావిలించుకుని... "ఒక్క రైనా ఉండలేనే, రోజూ వచ్చిచూసి వెళుతూండవే అక్కయ్యా! ... మిమ్మల్నందర్నీ విడిచివెళుతూంటే, ఏమిటో తగని దిగులుగా ఉందే...' అని

గావురుమన్నది. నేనూ, అధైర్యపడితే ఇక్కడి మరీ బెగటిల్లిపోతుం దని, రొమ్ముగు అదుముకుని... సముదాయించాను. చెపుదా మనుకున్న నాలుగుమాటలూ చెప్పక ముందే...అన్నయ్యా, బంకీవాడు తొందర పడుతున్నాడని వచ్చి మాకిద్దరికీ ఎడబా టులు చేశాడు. పోనీ ఆతరువాత వాడన్నా తిరిగిచూశాడా... నేను అనుక్షణం పోరుతూన్నా... ఏముందిచూసేందుకు ..వాళ్ల కాపురం వాళ్లు చేసుకుంటూన్నారు. చీటికీ మాటికీ... ఇట్టే అట్టే మనంగనక వెళుతూంటిమాయెనా, లేనిమీద ఏం నేరాలు చెప్తుతూందో .. మన కేం దోచిపెడుతూందో అని అని ఆయన అనుమానపడవచ్చును... లేనిపోని కలతలు తెచ్చిపెట్టడం ఎం దుకూ...' ఇలా సాకులు చెప్పి తప్పించుకుంటూండేవాడు.

వారంరోజులైంది - నాకిల్లో ... ప్రొద్దున్నే ముగ్గు వేస్తూండేవేళకు శాస్త్రుర్లు వీభూతి పెండెకట్లుతో ఊడిపడ్డాడు... 'అంబయ్య ఇంకా నిద్రలేవలేదుటమ్మా...' అని రోడ్డుమీద నిలుచునే ఓ పిల్లుకేక పెట్టాడు. పలుదోముపుల్ల తిరి తిప్పి నములుకుంటూ, అన్నయ్య, కేకవిని, లోపలనుంచి వచ్చి .. ఆయన్ని రమ్మని తలుపుసిరాను. ముక్కు ఎక్కుతూ, నావంక మోరపెట్టి... 'దానికి కొంచెం నలతగా ఉందమ్మా...చెయ్యి తీరిక అయినతరువాత ఒక్కమారి వచ్చి చూసిపో...' అని, అన్నయ్యతో ఏదో ఈమాటా ఆమాటా ఆడి వెళ్ళిపోయి నాడు.

వినేటప్పటికే నాకు కాళ్ళూ చేతులూ ఆడలేదు. ముగ్గు బుట్ట అక్కడే పారేసి పరుగెత్తాను. పోయిచూద్దునుకదా...

పిల్లది బొత్తిగా లోకెడ్డది. గడపలో కాలుపెట్టి నప్పటినుంచీ మూసినకన్ను తెరవడంలేదుట... ఆయన, ఒంటిపూట ఇంత ఉడకేసుకు తింటూ... దానికి జావకాచి పడేస్తూ... వ్యవహారం ముదిరేదాకా... తీసువచ్చాడు. నన్ను చూసేటప్పటికి, జానకికి ప్రాణం లేచివచ్చింది. ఏముందీ, ఒకరి నొకరు కావిలించుకుని... దాన్నిచూసి నేను ఏడవా... నన్నుచూసి అది ఏడవా: ఇంతలో అన్నయ్య కూడా వచ్చాడు. స్థితిగతులు తెలిసినతరువాత వాడికీ వెష్టబుట్టింది. ఆపళంగాపోయి డాక్టరును పిలుచుకువచ్చాడు... టైఫాయిడ్ అని తేలింది.

మా యింటికి తక్షణం తీసుకువెళ్దామన్నాను. ఆపిసినారికి ఖర్చు తగ్గడమే కావాలిసింది... వెంటనే సరే అన్నాడు. కాని, ఒకచిక్కు వచ్చింది. మావదినె, కార్యం అయిపోయిన మర్నాడే పురిటికివెళ్ళింది. అన్నయ్య ఆసాయంకాలమే దొరతో సర్కీటు వెళ్ళాలట... సెలవు దొరికే నౌకరీ కాదాయెను: మళ్ళా తిరిగి రావడానికి ఏ ఇరవైరోజులో పడుతుంది... అంత వరకూ, రెండోదిక్కు లేకుండా నేను నిభాయించడం ఏలా? ఏమిటీ చేయడం ఇప్పుడు? నాకు ఎంతమాత్రమూ ఇష్టమూ లేకపోయినా, ఆ మానవుడు, ఉండమని అనకపోయినా, తప్పిందికాదు: అది, మళ్ళా లేచి ప్రజల్లో పడేదాకా అక్కడే నా కొలువు.

తిరిగివచ్చి, మడిధోవతులుపట్టుకుని వెళ్ళి... వేగిరంస్నానం చేసి వంటచేశాను. అన్నయ్య, మొగమాటం చంపుకుని ఆపూట అక్కడే భోజనంచేసి సాయంత్రం బండికి వెళ్ళిపోయినాడు.

క్రమంగా, ఆరోజు కారోజు ముసలాయన రుసరుసలు మాని, కొంచెం ముఖంవిప్పారి ఉండే..డు. షడ్రసోపేతంగా చేసి పెడుతూంటి నాయును; ఏం తీపెళ్ళిందా...వేళకు అన్నీ అమరుస్తూంటే; మొదటిలో మాట పలుకూ లేకపోయినా ఆనాటికానాడు, అదీ ఇదీ కనుక్కోడం... భోజనం ముందర లోకాభి రామాయణం వేయడం... ఆషామాషీ లాడటం... నన్ను నవ్విస్తూండటం .. మొత్తానికి, నా చేత అక్కరకు వచ్చినట్టే ఉంది: మనిషి కవళికలో కొంతమార్పు కనిపించింది. నాకుకూడా, మొదట ముళ్ళమీద ఉన్నట్టుండీ, ఎప్పుడు ఇవతల పడదామా అని ఉన్నా... పోనుపోను, కొంత బెరుకు తీరింది.

మూడువారాలు గడచిపోయినవి. జానకి జబ్బు పుళ్లుముఖంపట్టింది. పథ్యం పెట్టి, నేను మా యింటికి వద్దామనుకున్నాను. కాని, మన యత్నమూ, తానొకటితలిస్తే దైవమొకటి తలచిందని... కావలసిన కారణార్థం వేరుగా ఉండగా... ఇంతకూ, అన్నీ అల్లా ఒనగూడాయి. అన్నయ్యా ఇంకోపదిరోజుల దాకా రానని, టపా తీసుకువెళ్ళే జవాను చేత కబురంపించాడు. అందాకా అక్కడే ఉండమని జానకి పట్టుపట్టింది. మా మరదికూడా... ఏకళ నున్నదో ... బలవంతం చేశాడు. పోనీలే, వాళ్ళు అంత ప్రాధేయపడుతూన్నప్పుడు ... అక్కడ మాత్రం మించిపోయే దేముంది, ఒంటరిగా ఉండాలిసిందేకదా, అన్నయ్యా వచ్చేదాకా: పోనీ, ఈలోపుగా పిల్లకు జవపట్టే దాకా కనిపెట్టుకుని ఉండవచ్చునని... అట్టే బెట్టుచెయ్యకుండా మెత్తపడ్డాను.

పడిలేచిందా, అప్పుడే పొయిలాకటకు రానియ్యడానికి నేను ఒప్పుకోలేదు. ఏం గంప చాకిరీ ఉందని? ముచ్చటగా ముగ్గురికి వండి వార్చడం అదోపనా? పైగా, మాతల్లి, లేచి తిరుగుతూండటమే నాకు కొండంత సత్తువ తెచ్చింది. జిహ్వా చచ్చిఉందేమో కావలసినవి అడిగి చేసిపెట్టేదాన్ని...

తిన్నది వంటపడుతూన్న కొద్దీ...బాగా తెప్పిరిల్లి కోలుకుంటూంది జానకి: సంధ్య పడగానే, ముందుదానికి అన్నం పెట్టేనే దాన్ని... అంగట్లో మెతుకులు అంగట్లో ఉండగానే. చెయికడుక్కోడం వ్యవధానం పక్కమీద ఒరిగేది పగలు కునకడానికి వీలులేదేమో, మళ్ళా పొద్దుపొడిచేదాకా ఆదమరచి నిద్రపోయేది. నేను, ఆయనకోసం కనిపెట్టుకుని ఉండి, తిన్నతరువాత... పిండో పాడో నోటకొట్టుకుని, మూతలు పెట్టేసి, వసారా అంచున ఆమాలతీ పందిరికి దగ్గరగా పక్కవేసుకునేదాన్ని: జానకి పక్కగదిలో పడుకునేది ... కటకటాల తలుపు కనుక... పిలిస్తే పలకడానికి అందుబాటు. అయన... ఇంటిముందు ఆరుబయట పడుకునేవాడు.

—అర్ధరాత్రి...చప్పున మెళకువ వచ్చింది. పిండారబోసినట్లు వెన్నెల...ఆలకించి చూశాను: అవతలపక్క, కునిసందులో ... కొంచెం అలికిడి వినపడ్డది: నాళ్ళ నడుమ; దొంగా తోడుమోతూ రావడానికి వీలులేనిస్థలం: ఏమిటా చూద్దా...మని లేచి, మెల్లిగా ఆ వేపుకు వెళ్ళాను:

మందారచెట్లనీడలు పడుతూ నేలంతా, చీకటీ వెలుతురూ మాసికల చదరంగ పాళీలాగా ఉంది. మొదట

ఏమీా కనిపించలేదు, మళ్ళా పరకాయించి చూశాను: చెట్ల చాటున ఎవరో ఉన్నట్టుంది... కాళ్ళు చూచాయగా కనిపించి నవి. ఒళ్ళు ఝల్లుమన్నది: గుండె గొంతుకలోకి ఎగదట్టి కెవ్వు మని.. దగ్గు, అరుపు కలిసి... కేక పెట్టాను. నోట...అరవ డానికైనా...మాట రావడం లేదు: కాళ్ళు పాతుకుపోయి నాయి. వెర్రిభయంలో... రెప్ప ఆడలేదు: గుడ్లు అప్పగించి చూస్తూ నిలవబడిపోయినాను.

— మనిషి తొందరగా నడిచిపోతూన్న చప్పుడు... దొడ్డితలుపు ఠపేలున పడ్డది: మా మరిది, చెట్టుచాటునుంచి, నిదానంగా, నాదగ్గిరికి వచ్చాడు. నన్ను చూసి.. పోల్చుకోక ముందు ఉలికిపడి...అంతలో తెప్పరిల్లాడు: భార్య ఏమోనను కుని భయపడి ఉంటాడు మొదట : అవతల మనిషిని నేను గుర్తించాను : మాయింట్లో పనిచేసే...ముత్యాలు :

'ఇక్కడ నిలుచున్నావేం...నిద్రలో నడిచివచ్చావా' ఆయన ఏమీా చలించకుండా...మామూలుగా అడిగాడు : నే నేమీా సమాధానం చెప్పకుండా ఊరుకున్నాను. ఒక్కనిమిషం నన్ను పరకాయించి చూసి, 'పోయి పడుకో' అని, ఏదో గొణుగుకుని వెళ్ళిపోయినాడు.

నేను, వెళ్ళి, మళ్ళా మంచంమీాద పడుకున్నాను. నిద్ర రాదు...ఆలోచనలన్ని సముద్రకెరటాల లాగా నన్ను ఆవ రించి ఊపివేసినవి. పక్క కుదరక చాలాసేపు అటూ ఇటూ దొర్లాను : ఎంతోసేపటికి కాని, ఎట్లో అటు పాలుపోయింది

కాదు. నిశ్చయానికంటూ వచ్చిన తరువాతకూడా...తలచుకో వడం, దద్దరిల్లిపోవడం! ఎలాగైతేనేం, మనసును ఒప్పించాను : జయించానన్న ఉత్సాహంలో...చిరునవ్వు పెదవుల మీద మొలకలెత్తుతూండగానే...జోగి పోయినాను :

—ఎంతోసేపటికి, మళ్ళా మెళకువ వచ్చింది : తట్టి... గిలిగింత పెట్టి లేపినట్లుంది : కళ్ళు తెరిచాను : వెన్నెల మసక వారింది...చుక్కపొడవబోతూంది : చూపు...మరల్చి... ఆ... వేపుకు...సారించాను : నా కాళ్ళదగ్గర...పాదం పట్టుకుని కదుపుతూ...మా మరది కూర్చుని ఉన్నాడు : నాకు, తెలుసును...ఆయన వస్తాడని...అలా అవుతుందని : నాకు, ఇష్టమే కాదూ...

నేను మసలడం కనిపెట్టి...ఆయన, ధైర్యం చాలక... చట్టున లేచి నిలుచున్నాడు :ఎక్కడ మనసు మార్చుకుని... బెడిసి పోతాడో అని...నోరు మెదల్పకుండా...ఆవంక చేతులు జాచి...బలవంతంగా పొదువుకున్నాను..ఆయన్ని సుఖపెట్టడంలో...ఆయనకోసం...నేను, లోకం...నన్నే నేను...మరచి పోయినాను.

ద్వితీయవిఘ్నం కాలేదు...అలా అవుతుందేమోనని... ఆయన కుండవలసిన ఆర్దా అంతా నేను పడ్డాను : వారం రోజులు...వరుసగా—

పొరబాటుకాదు... తెలిసి చేసినపనే ..నన్ను మోసగించ లేదు...ఆయన...మొగమాటపడకపోతే ..నేనే బలవంతంచేసే

దాన్ని...అవునమ్మా...ఆపరిస్థితి అలాటిది ! ఏం.. నీకుకూడా ఈ మాటంటే ఆశ్చర్యం వేస్తూన్నదా ? కళ్ళుకానరాని కండ కావరంతో... అప్పుడు పోతరించిపోయి . ఇప్పుడు ఇంకో వేషం వేస్తూంది...ఇది... ఎంతకైనా తగిందే... తెగించిపోయిన తరువాత...అని అనుకుంటూన్నావా ?—కాదమ్మా, కథ సాంతం విను...

వారంరోజులు దాటినతరువాత... అనుకున్నదానికన్న ముందరగానే, అన్నయ్య తిరిగివచ్చాడు : నేను...మళ్ళా మా యింట్లో...గృహప్రవేశ మైనాను : అప్పటికి జానకి బాగా లేచి తిరుగుతూ, దానిపని అది చేసుకునే ధోరణిలో పడ్డది.

నెల్లాళ్ళయింది...కొంచెంబెంగగా ఉంది :

రెండోనెల... అనుమానంగా...అవునా, కాదా అని ...ఏలాగో మనసు కుదట పరుచుకుంటూ తిరిగాను :

మూడోనెల... నిశ్చయమయింది : కొంప నిలువునా కూలిపోయింది- అన్నయ్యకు కూడా ఆచోకీ తెలిసింది :

ఏంచేస్తాడు, పాపం... నన్నా గద్దించి అడగలేడు... ఎవరితో నన్నా చెప్పడానికా ... ఇంకా ఏమన్నా ఉందా ... వాడలో ఉండనిస్తారా...తల ఎత్తుకు తిరగనిస్తారా? ... దాచడమా ... ఎంతకాలమని? ఎప్పుడో ఒకప్పుడు పాపం బద్దలుకాక తప్పుతుందా?

అయిదోనెల జొరబడేదాకా...ఏంచేయాలో తోచక ... కాలుకాలిన పిల్లిలాగా ...నిలిచినచోట నిలవకుండా ... నానా

హైరానూ పడ్డాడు: ఇక, ఒకక్షణం తామసించడానికి వీలు లేదు...అప్పటికే అమ్మలక్కలందరూ ఏలాగో పసికట్టి...గుస గుసలు పోతూన్నారు: అవి ఏమన్నా చెవినిపడ్డవో ఏంఖర్మమో... ఎన్నడూ పల్లెత్తి నన్ను ఒక్కమాట సాధారణంగా అనని వాడు ...ఆనాడు ఇంటికి వచ్చీరావడంతోనే రుద్రుడై పోయి నాడు . . . ఒకటని, ఒకటి అనలేదా: అన్నిటికీ ఒడిపట్టి ఊరు కున్నాను.

ఊరుకున్నా నన్నమాటే కాని . . .పైకీ, నాకు తరతర బుట్టింది. అంతవరకూ ... ముంచుకువస్తున్నా . . . మనసు ... తుడిచిన పలకలాగా . . . ఏ ఊహా కనపడకుండా . . . అదో మాదిరి మైకంగా ... ఏదోఫలానా అనిచెప్పలేని బాధగా . . . సంతోషంగా . . . ఉంటూవచ్చింది: అన్నయ్య ధూకుడు చూసిన తరువాత ఒకమాదిరి అయోమయంలో పడి పోయి నాను . . . ఏది దారి? . . . అంతటితో ఊరుకుంటాడా . . . పెచ్చుమీరిపోయి . . .రెక్కపట్టుకు వాకిట్లోకి ఈడ్చివేస్తే . . . నేను ఏం కావాలి?

అనుకున్నంతా అయింది . . . గెంటడం తరువాయి . . . కాని, మామరది . . .ఆయన్ను మా అన్నయ్య సలహా అడిగాడట, ఏం చేయాలని . . . అవును గొర్రె కటికవాణ్ణే నమ్ముతుంది! . . ఆయన అడ్డుపక్షి, ఏదో హితబోధచేసి . . అన్నయ్య మూర్ఖం విడువకపోవడంచేత . . తానేఖర్చులన్నీ భరించేపద్ధతిమీద . . ఆ రాత్రిరాత్రే . . పట్నంబండికి పంపిం చాడు.

రైలుదిగగానే... నన్ను తీసుకు వెళ్ళడానికి స్టేషనుకు వచ్చిన బుక్ఖా దొరసాని వెంట ఆస్పత్రికి వెళ్లాను. మా మరిది ...వాళ్ళకు, నేను బండి ఎక్కగానే టెలిగ్రాం ఇచ్చాడట...

మళ్ళా ఏడునెల్లకు ... ఇవతలపడ్డాను ... నా బంగారు తండ్రిని, వాళ్ళు...ఏంచేసుకున్నారో...ఎవరికి పెంచుకోనిచ్చారో...భూమిమీదపడగానే...వాడికీ నాకూ ఈ జన్మకు రుణం తీరిపోయింది!

ఎల్లకాలం..,వాళ్ళుమాత్రం ఉండనిస్తారా?-నాకు మళ్ళా మా ఊరు వెళ్ళాలంటే...మొగం చెల్లడంలేదు. ఎప్పుడు బయలుదేరుతావని అన్నయ్య ఉత్తరం వ్రాశాడు ... నేను మెదలకుండా ఊరుకున్నాను. అప్పుడు, ఆయనే స్వయంగావచ్చి ...తీసుకువెళ్ళి యింట్లో దిగవిడిచాడు.

వదినె...నెల్లాళ్ళక్రితమే పిల్లనెత్తుకుని వచ్చింది, అన్నయ్య వెళ్ళి భారసాల చేసుకుని ... నెల వెళ్లకముందే ... తీసుకువచ్చాడట. వచ్చానా..నాతో, మావాడూ మాట్లాడలేదు..సరే, మావదినె, నన్ను చూడగానే మొగం పక్కకు తిప్పుకొని గదిలోకి వెళ్ళిపోయింది. చెప్పరానిదానికన్నా కనాకష్టమైపోయినాను.. తెల్లవారి లేవడంతోనే నేను కంటబడితినాయెనా, ఇద్దరి ముఖాలూ మటమటలాడిపోయేవి, అయితే, అన్నీ అమర్చిపెడితె, .విస్తరి ముందరికివచ్చి. .ఎంచులుపెడుతూ .సుష్టుగా భోంచేయడానికి . . అప్పుడు మాత్రం. .ఏ అడ్డంకీ లేదు; అందుకు పనికివస్తాను.

నామీద దయతలచి ఉంచుకున్నారా?. .చాకిరీకి మనిషి తేరగా అమిరిందిగనుక .ఏలాగో సరిపెట్టుకుంటున్నారు. మా వదినె. .ఆరాణీ, అసలు మంచినాడే అంతంతామెను . ఎన్నడూ అవతల చెంబు ఇవతలపెట్టిన పాపాన పోయిందా. .అందులో, బాలింతరాలు. అన్నయ్యకు ఆవిడ కాలు క్రిందపెడితే ఎక్కడ అరిగిపోతుందోనని. .ఎంతభయం?

నేనూ. . బాలింతరాలనే కానూ. .కాని . . నా ముద్దు ముక్కలు చేసేది ఎవరు? ఆ మాట తలవటానికైనా . ,వీలుందా?. .ఒళ్ళు భారకించినా. .ఎంత ఓపిక లేకపోయినా. . వేళకు లేవకుండా, కొంచెం బధకించి మూలిగానో, ఇక అవి దెప్పుళ్ళు కావు. . సాధింపులుకావు .నాతల్లో! గుండె చిట్లెం కట్టిపోయింది. ఎంతకైనా తల ఒగ్గవలసినదాన్నేగా.

'నాకంట నరుడు పడరాదు, నరుడి కంట నేను పడరాదు'. .ఇలా రెండునెల్లు పైగా . . రాణీవాసమైపోయింది నా బ్రతుకు. వెలుపల సావడీలోకైనా వచ్చేదాన్ని కాదు. అన్నాళ్లు గడపదిగితే, ఒట్టు!

ఇక, లోకం.

పాడులోకం. . వేలు వంచడానికి సందుదొరికితే ఊరుకుంటుందా. ..గోరంతలు కొండంతలుచేసి, దుయ్యబట్టుకోక మానుతుందా? ఒకకంట్లో సున్నం. . రెండోకంట్లో కారం.

అన్నయ్యను. .పరమయోగ్యుడికి ఇంత కష్టంవచ్చిందా, అయ్యో పాపం. .అని ఊరడించింది.

ఇంతకూ కారకురాలినికదా అని . . ఈ కులనాపకు రాలిని పడదిట్టింది:

తిడుతూన్న ఆనాలికే . . మామరది . . మహానుభావుడు, ఆపత్తులో అడ్డపడ్డాడని ఆయన్ను అందలాన పట్టింది: అయినా, అది ఎంతవరకు నిజమోాలే . . నోరు మాటాడుతూంటే నొసలు వెక్కిరిస్తూన్నప్పుడు . . దేన్ని నమ్మడం?

ఇలా . ఈ అగచాట్లమారిబ్రతుకు . . ఎప్పటికి తెల్లవారనూ అని నాగుండెల్లో రాయిపడ్డది. కాని, ఇంతలో ఏం జరిగిందను కున్నావూ . .

మా జానకికి. . నెలలు నిండాయి. సుఖంగానే చెంబెడు నీళ్లూ పోసుకుని . . తల్లీ పిల్లవాడు గట్టెక్కి ఇవతలపడ్డారు. నక్షత్రదోషం ఏదో రవంత ఉందట, పోవడానికి నూనెలో మొగంచూసుకున్నారు. నేను రానన్నా, ససేమిరా కాదు కూడదని, పట్టుబలవంతాన పీక్కెళ్లారు.

మా అమ్మడు పీటలమీాద కూర్చొనిఉండగా, చూడముచ్చటై ఒక్కమారు చేయితీరిక చేసుకుని, గుమ్మంలోంచి తొంగిచూశాను . . ఎన్నాళ్లైందో దాన్నిచూసి . .

అది నావంక చూసేసరికి . . ముఖం వెనక్కు లాక్కున్నాను. దాని కంట పడలేక పోయినాను:

ఆశీర్వచనాలైన తరువాత . . పాపణ్ణి పొత్తిళ్లలో పొదివి . . నాదగ్గరకు తీసుకు వచ్చింది జానకి. నేను తలుపుకు చెయిబారజాచి జారగిలబడి . . కంట నీటిబొట్టు పొడము

కుండా, పళ్ళుబిగివిని నిలుచుని ఉన్నాను. నావాలకం ఏం కని పెట్టగలదు . . . పిచ్చపాడ గట్టు. . .పిల్లవాణ్ణి నాచేతులో పెట్ట బోతూ. . . 'వెళ్ళునాయనా . . . అమ్మ ! . . . చూడవే . . . నిన్నుచూసి నవ్వుతున్నాడేవ్, అక్కయ్యా! . . . ఇక నిన్ను వదలడేమోనేవ్, . .తీసుకోవే. . పోనీలే నేను పనికిరాకపోతే. . మీఅమ్మ దగ్గరకే వెళ్ళు బాబూ. . .' అని తన ఉబలాటం కొద్దీ . . . ఏమేమో పలుకుతూంది. నాకు . . . ఏలా ఉందని చెప్పనూ? . . .

పక్కను చోద్యం చోస్తూఉన్న పెద్ద ముత్తైదువ ఒకా విడ . . . 'అవునే, జానకీ . . . వీడిని మీ అక్కయ్యకు ఇచ్చేసి . . . నీవు ఇంకో కొడుకును కనుక్కోవే. . .' అని. . . ఆమెకు తోచినట్లు. . . హాస్యమాడింది. . .వింటూన్నవాళ్ళు నవ్వారు: నా మనసులో భగభగమన్నది . . జాస్తూన్న చేతులు వెనక్కు పెట్టుకుని . . నీరోడుతూన్న కళ్ళతో వెనక్కు తిరిగాను : అం దరి పాయసాల్లోనూ నెయ్యి ఒలికినప్పుడు . . నా వంతుకు దక్కేది . . పచ్చి విషమేనా?

'కంట్లో నిప్పులు పెట్టుకుంది . . చూసి ఓర్చే నేర్పు కూడానా . .' జానకి . . మా జానకే . . ఈ మాటలు. . . నా వెనకాల అన్నది : . . .అననీ, నిండా మునిగినవాళ్ళకేం చలి?

అంతటితో . . ఆ కాండ అయిపోయింది: అన్నం నోటికి పోలేదు: మెతుకు ముట్టకుండా . . ఊరికే విస్తరిముందర కూ

ర్ఘ్చని లేచాను: దానికేంలే, కడుపు నిండే ఉందికాదూ, ఇవన్నీ చూసుకుంటూ!

ఓ విధంగానా, నాకు వంచన! పులిమీద పుట్ర రేగింది! రాత్రి భోజనాలైన తరువాత, ఒంటిపాటున , . మామరది నాకు, అడ్డంవచ్చాడు: మరి, అధమం ఏమూడు నెలలైనా . . గదిలో పక్క వేయించుకునేందుకు వీలు లేదుగా . . ఎదురు గుండా నేను కనబడుతూంటిని. ఊరుకోవలసినంత కర్మం ఏం వచ్చింది?- ఒకసూరు లోకువైన తరువాత . . ఇక . . ఛీ . . మగపురుగులు !

ఎంత స్వాతంత్ర్యంతో నాచెయి పట్టుకున్నా డనుకున్నా వు? ఊరుకున్నాను: ఇంకా ముదరనీ . .

రెండో చెయ్యి . . నా భుజంమీద వేసి . . మెడ మీదుగా వాల్చి నన్ను దగ్గరకు లాక్కునే . . గృహస్థ మా ర్గంలో . . ఉన్నాడు:

జానకి . . గుమ్మంలోకి వచ్చింది . . మమ్మల్నిచూసి గుడ్లు వెళ్ళుకొచ్చి . . తూలుతూ వెనకి అంగవేసి . . తలుపు ఠఫీమనిపించి, లోపలపడి కెవ్వు మన్నది.

- మా ప్రబుద్ధుడు, తన ధోరణిలో తా నున్నాడు కాని . . వెనుకా ముందూ చూడటం ఉందా? రానిచ్చాను . . మొదలకుంటా . . అసహ్యించుకుని ముఖం తిప్పేసుకోకుండా . . మరీ దగ్గరకు రానిచ్చాను. మా యిద్దరి పెదవులకీ, నూలువాసి కూడా ఎడం లేదు. అందాకా వచ్చినతరువాత, పిడికిలి ఇనుప

గుండులాగా చేసి, ఎగువను, గురిగా పళ్ళు కరుచుకు పోయే ట్టు . . గడ్డం చెక్కలయేట్టు . . విరగ బొడిచాను. తగిలే తగలడంతోనే, మళ్ళా కిక్కురు మనకుండా, చాపచుట్టుగా పడి పోయినాడు . . మా మరది . . అంత సత్తువ ఎక్కడనుంచి వచ్చిందో నాకు!

వెనక్కు తిరిగిచూడకుండా . . దూసుకు వచ్చి . . చూడకుండా రావడంలో . . పారిజాతం చెట్టు మీాద పడి, లేచి . . ఎలా పోయిపడ్డానో, మా యింటిదగ్గర పిలవగా, పిలవగా ఓపట్టుకు, మా వదినె . . ఏమిటొ సర్దుకుంటూ . . వచ్చి తలుపు తీసి . . నిలవకుండా పోయి, గదితలుపు గడియ వేసుకున్నది — నాకు, ఊరినపుండుమీాద ఉప్పూకారం చల్లిన ట్లయింది—అందరికీ నేను భారమే!

అప్పటికి ఈ ఆలోచన లేదు సుమా మతిచెడి, . . మనస్సంతా పాడై పోయి . . క్షోభపడుతూ . . సావడి నాలుగుమూలలా కలయ దిరుగుతూండగా . . వంకెను, బరువుగా. . అన్నయ్య కోటు . . జేబు కనిపించింది . . చూడగానే . అప్పుడూ, ఈ ఆలోచనతోచింది . . చూస్తూన్నకొద్దీ అది పాదుకు పోయింది. ఒక్క-క్షణం ఇక ఆలస్యం చేయకుండా, పర్సు మెల్లిగాతీసి . . కావలసినంత అందులో ఉందో లేదో చూసుకుని, చేతబట్టుకుని . . పిల్లిలాగా అడుగులో అడుగువేసుకుంటూ, ఆ యింటికి . . యింటివాళ్ళకూ . . అంతటితో ఋణం తీర్చుకుని . . వచ్చేశాను.

ఎవరికంటా పడకుండా . . రైల్లో పడి . . రెండు సార్లు, ఎక్కడమారాలో తెలియక, దోనతప్పి . . . వెనుకా ముందూ అయి . . చివరకు . . ఇవాళ అసుర సంధ్యలో . . ఇక్కడ దిగాను,

- దిగి యకాయకిని వచ్చేశానమ్మా, నాలిక పిడచబారి పోతూంది. మా గంగమ్మ తల్లిని చూడందీ . . పచ్చి మంచినీళ్ళన్నా ముట్టకూడదనుకుని. . తీర్థోపవాసఫలం దో వ లో నే దక్కించుకు వచ్చాను.

చిరుకెరటాల మీదుగా. .అనుమానాలన్నీ వొడ్డుకు పరుగెత్తిస్తున్నావా?. .నాకు అంతమాత్రం తెలియదనుకున్నావమ్మా! చెప్పనా?

మా మరదిని ఎందుకు లోబరచుకున్నాననా?-నా కోసం కాదు. .నా చెల్లెలికోసం. వెలిరుచులు మరగి, ఇక దానికి దక్కకుండా పోతాడేమోనని. . దాని జీవితం ధ్వంసంకాకుండా, నన్ను బలి యిచ్చుకున్నాను. నాకే కోరికఉండి, చెడిపోవాలనుకుంటే . .ఆముసలితాతేనా . . దొరికింది - దేశం గొడ్డుపోయిందా?- తనను వలచివచ్చా ననుకున్నాడు. .యిష్టం వచ్చినప్పుడు, వీలు చిక్కినప్పుడల్లా. .లోకువచేసుకోగల. .ప్రజ్ఞ ఉందనుకున్నాడు . . పాపం. .పిచ్చిబ్రాహ్మడు. ఆ జన్మ అంతేలే'- బుద్ధి వచ్చిందంటావా, ఏమో, నాకు నమ్మకంలేదు. బుద్ధే ఉంటే నీతీనియమం అనేదే ఏమాత్రైనా ఉంటే-చేసిన పాడుపని ఆసలాతో,' ప్రతిష్ఠ సంపాదించుకునేందుకు, పెనగులాడుతాడా? — కన్ను తెరవని పసికూనను కటికవాళ్ళకు అప్పగించనిస్తాడా?

— జానకి. .నేను విరగడై పోయిందే చాలునని. .సంతోషిస్తుంది. పోనీలే, నామీద జాలితలవడం . . నాకోసం బాధ పడటంకన్న . . ఇదేమంచిది. నామీద కోపం అల్లా దానికి మొగుడిమీద ప్రేమను పుట్టిస్తుంది. మా ప్రేమిపళ్లు అందుబాటులో లేక పోయినకొద్దీ . . మెడ మరీ సాగుతుంది: ఇంకొకరికి దక్కిపోతున్నాడని తెలిసినప్పుడు కాని. ఆడదానికి . . మగవాణ్ని . . తానే సర్వాపోశనం పట్టాలనే తహతహ పుట్టదు : ఆలా జరిగిందో . . అంతకన్నా, నాకుమరికావలసినదేముందీ?

కన్నతరువాత . . నెలలు మోసినందుకు ఫలం దక్కకుండా చేజారిపోయిన తరువాత కాని . . కడుపు తీపంటే ఏమిటో తెలియలేదమ్మా. పోనిలే . . ఒంటరిగా మాయమై పోవడంకన్న, తీరని కోరికలన్నా, వెంటతీసుకు వస్తూన్నాను: అదీ కొంత మేలే కాదూ?

ఎవరిమీద పగ సాధించను . . ఎన్నింటికని ఏడ్వను . . నాకు లేకపోయినా . . ఇంకోరన్నా . . నామూలాన కుదటపడి బాగుండటమే పదివేలు !

అన్నయ్య అంటావా- 'పోయి గంగలో కలవనీ—దానికిలాటి విపరీతపుబుద్ధి పుట్టినప్పుడే అదిమాకు కానిదై పోయింది అని మొండిగా అనేస్తాడు : ఒకవేళ . . అనలేక ఊరుకున్నా, నేర్పే నెరజాణ, మావదినె ఉండనే ఉన్నదిగా!

నేను, ఎవడివెంటనో పడి, దేశాలుపట్టి పోయినాను. అనుకుంటారు. అంతేకాని . . వాళ్లనోటివాక్యమే ఫలిస్తూన్నదని , , ఏలాఅనుకోగలరు?

ఇక . . వాళ్లెవరికీ నేను కలలోనైనా కనపడను కాదూ-

'నీది ఇంతదొడ్డమనసా' అని ఆశ్చర్యపడుతున్నావా?- నీ వొక్కతెవేనా, మ రి, ఈ ఏడేడు పధ్నాలుగు లోకాల్లోనూ?

మీచెల్లెలు పార్వతికోసం . . మహేశ్వరుడితో నీవు ఆడిన నాటకమే — నేనూ వర్లించానమ్మా: నిన్ను చూసి నేర్చుకున్న దేనమ్మా.

మన ఇద్దరి మనసూ ఒకటి- మన కోరికలు ఒకటి-మన ఇద్దరి పేరుకూడా ఒకటే . . అందుకనే . . నిన్ను వెదుక్కుంటూ వచ్చానమ్మా.

---

# కనకజానకి

పక్కలో కూర్చుని చక్కలిగింతలతో నిదుర మెలుకువ తెప్పించినది:— 'పగలు .. నిదుర ..' నానిదుర కలత చూసి పకాలు మన్నది .. 'పనికి .. చెరుపంటారు .. పెద్దలు .' చెక్కిలి నొక్కుకుపోతూంది: లేచి కూర్చున్నాను. మత్తు విదిలించుకుంటూ .

'రేపు ఉదయానికి తిరిగి ఆఫీసు చేరుకోవాలా .. రాత్రంతా ఇహ .. బండి కుదింపులో నిదుర లేక'

'పక్కను నేనూ లేక ..'

— విరుచుకుంటూన్న, ఒళ్లు ఆపాళాన ఆపి కొంచెం చిరాకుగా, 'ఎకసెక్కం పనికిరాదనే - అదమాయింపుతో 'ఏమిటీ వాలకం?' - అనే ప్రశ్న, వేశాను.

ఇంకా మీకు నిదురే .. నేను రెప్పలు ధూకుడుగా అల్లార్చాను.

'మేలుకున్నా ఇంకా కలలే' - పాఠం చెపుతున్నట్టుగా నన్ను పసివాడిక్రింద కట్టిన .. తొణకని బెణకని ఠీవి చూసి చూసి - -ముందుకు వచ్చేసింది.

'నీవు అంటూన్నది ఏమిటో తెలుసునా'-గదమాయింపులూ కోపం దాచుకో లేకపోయినాను.

'ఆహా మరి, మీరు అనుకుంటూన్నదీ. తెలుసు! ..

నా మొగం రమారమి కందగడ్డ అవుతూన్నది. ఆమెకు ఏమీ, చీమ కుట్టినట్టుగా నన్నా లేదు.

'అన్నీ అబద్ధాలు'

"అవును. మీరు ఆడినవి, అనుకున్నవి"

నాకు వింటూన్న కొద్దీ తామసం ముంచెత్తుకు వచ్చి, జవాబు చెప్పడానికి నోటమాట పెగలలేదు

— ఆమె నోరు చేసుకుంది.

— ‹అవును ముమ్మాటికీ మీరు నన్ను విడిచి బ్రతుక లేరు, నేను లేనిది ఇక మీజీవితం ఎడారి: నేను ఉంటే బ్రతుకంతా బంగారు పంట — మూడునాళ్ళ ముచ్చటలో మనము మురిసిపోయిందెంత? ఎన్ని అబద్ధాలు! ఎంత ముందు చూపున్న దండీ మీకు ?'

"అలాగే?"

‹మరి, యీలాగా కూడాను: పట్నవాసం నుంచి బంగారు తండ్రి, పల్లెటూరు పావనం చేయడానికి దయచేయగానే పడుచెవతె ఊరకుంటుంది? ఊరుకోని వయసుగత్తె, ఆ సామి పంట పండించేందుకు ఎంద రెన్నినా, హద్దుమీరకుండా, ఎలా ఉంటుంది ? ఎవరిమాటో కాదు, నేననేది, నన్నే: ఏంచేశాను, మీరు వస్తూన్నారనగానే, ఎవరో ఎలా ఉంటారో .. ఎలాంటి వారవునో కాదో కాకపోయినా అదెంత పని మన చేతిలోదేకదా, అని ఎన్నెన్ని ఆలోచనలకు పోయినాను. ఎప్పుడు వస్తారో అని ఎదురు చూశాను, రాగానే పనిగా మీ

కంటబడి చూసి కవ్వించాను. తలుపుచాటున నిలుచుని, మీరు చూడకుండా, చూసిచూసి, మెచ్చుకొని తల ఊచాను. బిడియం విడిచి పిలచాను; వలచాను; అవునా

'నా కంత గర్వం లేదు.'

'లేకపోతే తెచ్చుకోండి: నన్ను చూచిఅయినా నేర్చుకోండి. నాకు నేను అందగత్తెనని ఎంత గర్వ మనుకున్నారు? అందానికికాని, ఐశ్వర్యానికికాని నా కాలిగోరికి సరిపోయేవారు, ఈ ఊరిలో ఎవరున్నారు?'

'అవును, ఉండరు.'

'ఒకవేళ ఉంటే. మీరు నాకోసమనే ఉండరు'

'అది నేను ఒప్పుకోను, నీతిప్రధానంగాని'

'బూతుకు కూడానా ? మీ బులిబుచ్చికాలు నమ్మే అంత నంగనాచిని అయితే, మీరాడేమాటే నేపాడేపాట అయేది ... అప్పుడు మీరు, మనసులో అంచనా వేసుకున్నందుకు సరిగా మూటాముల్లే కట్టుకుని రొండోకంటివాడికి తెలియకుండా యింటిలోపాపలను యింటిలోనే విడిచి, మీ వెంటబడి, మీరు ఎక్కడికివెళ్ళితే అక్కడకువచ్చి తాళికట్టని - తలుపుచాటు - కాపురం చేస్తూ, మీరు రమ్మంటే రావడం, పొమ్మంటే పోయే చోటు లేకపోయినా పోవడం... అదేనా మీరు నేర్పే నీతి?

'నీవు పొరబడుతున్నావు... నీమీద నాకు పవిత్రమైన ప్రేమ.'

'ఒళ్ళు తెలిసే మాట్లాడుతున్నారా... యింకా నిద్ర లోకలవరింతలేనా ? మీరంత పవిత్రమైన ప్రేమ ఉన్నవారని తెలిస్తే, మీ చాయలకే నేను రాకపోదును : అదంటే నాకు అసహ్యాం'

'ఆ-హాఁ...'

అవును. భార్యకు భర్తమీద, భక్తునికి భగవంతుని మీద.. ఆలాటి అనురాగం పవిత్రమని అంటారేమో; అది నాకు ఏలా తెలుస్తుంది. భర్తలేడు. భర్తలేకుండా భార్యాత్వం నానొసటను విధిగా వ్రాసిన భగవంతుడు .. ఉండీలేడు."

—చీకటి తప్పుకు వెంపరలాడే ఒప్పుల కుప్పలందరూ తెచ్చుకునే సాకే, ఆమెకూ చిక్కింది, నా వెనుకటి అనుభవాలను పోల్చి చూసుకుని, నాలో నేను నవ్వుకున్నాను. అది ఆమె ఏలాగో కనిపెట్టింది. మళ్ళా అందుకున్నది.

'అందుకనే మీరు అనుకుంటున్నారు. ఆ అగచాట్లే నిజమై, ఎందుకూ కొరగాని వాడే నిజముగా మగడైతే, ఎందుకు తను మనసిచ్చినవానితో లేచిపోరాదూ అని, అంతేనా ? మీరు కాదని మోరాయించబోకండి.

'నేను ఎందుకు ఎవరితోనైనా లేచిపోవాలి ? ..

.. 'మీ మునసబుగారికి, మా అక్కయ్యను మొదటి మనువుకు యిచ్చారు : కాపురం లేక వయసు గడపలేక, ఆమె ఆయేడే మా పాలెగానితో మరో తాలూకాలో కాపురం పెట్టింది. కడుపు ఓనాడు నిండనీయండి నిండకపోనీయండి.

కరువుదీరా మగడంటూ ఎవడో ఒకడు దొరికినదే చాలు పది వేలనుకున్నది. దాని మూనాన అది సుఖపడుతూంది. అంతకు మించిన నోములు నోయలేదు : బూతులో నీతి నిలుపుకుని ఒకడినీడనే ఒదిగి ఉంది.

'మా బావకు నన్ను కట్టబెట్టారు : మా వాళ్ళు అంతా సిద్ధమే . . అల్లుడినోట శని ఉన్నదని మావాళ్ళకీ ఊరివారికీ తెలిసినా, ఆ స్త్రిచూంసి అది పరాయిగా పోకుండా నన్ను ముందుకు త్రోశారు.

'నేను మరో - మరో దాన్నయితే, తిండీ తిప్పలూ తినక, యేడ్చి, అందరినీ యేడిపించి, ఏ నూయో - గోయో చూసుకుంటానని హంగామా చేసి, కొంపంతా ఓ కొలిక్కి తీసుకురావలసింది. కాని పెళ్ళిమాట వినగానే ఎగిరి గంతేసినంత సంబరపడి సై( అన్నాను. ఇంకా ముహూర్తం ఎన్నాళ్ళో ఉన్నా ఆ పాళనుంచే అక్కయ్య నగలన్నీ పెట్టుకుని, కట్టినకోక కట్టకుండా దాని చీరలన్నీ కట్టుకుని, నా అంత సిగ్గుమాలిన శిఖండి యింకొకతె లేదన్నంతగా తయారయినాను: అవును. నాదేం పోయింది ? నలుగురూ నన్ను చూసి నవ్వితే, ఎందుకో తెలియకపోతేనూ నేను బిడియపడట. అయినా నవ్విన నాపసా నెవతె మాపరగణాలో అన్నిటిలో నన్ను మించే దొరసాని ? . .

'లోకానికి విజ్ఞాననేత్రాలే కాని, అవసరం వచ్చినపుడు అన్నలున్న కళ్ళు మూసుకుపోతాయి. అది, నా పంటిదానికి ఎంత ఉపకారం ? అందరూ అన్యాయం అని నా పెళ్ళికి అడ్డు

పడి చెడగొడితే నాకు యింత న్యాయం ఎన్నటికన్నా జరగ డానికి వీలుంటుందా ?

'లోకం ఏ మనుకుంటుంది, ఏం-ఉంటేనేం ఏం-లేకపోతే నేం. యేడుతరాలు గడచినా తరగనంత సంపద ఉంది. పిల్ల సుఖపడుతుంది. అదంటే, మొసలుకునే నేర్పులేక అలా అధ్వాన్నమై పోయింది కాని ఇది తెలివిగల బిడ్డ! ఇంతకూ, దానికి, అదృష్టం ఉండి నిండిన యింట మెలగవలసిన యోగం, క్రోసుకు వస్తూండబట్టే, ఆ పెద్దదానికి ఆలా పోయే కాలం వచ్చింది. ఏ దైవమో తిన్నగా చూస్తే, దానికి కడుపున రెండుకాయలు కాచి . .

' . . నన్ను నవ్వనీయండి. ఇప్పుడా సంగతులన్నీ తలచు కుంటే, ఉక్కిరి బిక్కిరిగా చక్కిలిగిలపుతూంది. నా కడుపున కాయలు కాయడం . . లోకం కళ్ళుమూసుకుని, అక్కరలేని అబద్ధాలు ఆడుతుంది: దైవం తలవని తలంపై అనుకోనివి కూడా నిజం చేస్తాడు. ముసలం కిసాలయించితే . . ఆ మగనితో నాకు నెల మసలడం . .

'ఆయన ఎన్నడూ నా జోలికి రాడు : ఎద్దులే పొలం ఒసితాడు. మునసబీతో పొద్దస్తమానమూ వేగి, మొద్దల్లే నిద్దర పోతాడు. ఆ పోడిమేయేమిటో యెరుగని పుటక; అది అందరూ ఎరుగున్నదే.

'అందుకనే నేను తొలిసారి నీళ్ళోసుకున్నానని తెలియ గానే, ఊరు అట్టుడికినట్టుడికిపోయింది. ఎవరా ఆ రాయుడు అని ఆసామీలందరూ అంచనాలు వేసి చూశారు. అంతు

చిక్కలేదు. నన్ను నిలవేసి... 'ఎవడే నిన్ను నిలువుదోపిడి చేసింది?'.. అని అడగడానికి ఎవరికి నిబ్బరం చాలలేదు. ఇంటి ఆయనకు ఆ గొడవే పట్టించుకోనవసరం లేదు.

'లేకపోతేమానె..మనిషైపుట్టిన తరువాత, ఆ మాత్రం అభిమానమన్నా ఉండకూడదా అంట? అబ్బె! ఆ విషయంలో ధర్మరాజు; చేతగాని మగడు ఏమో చేశాడని వెనుకటికి ఓ సామెత ఉంది. కాని అందరూ ఆలాటివాళ్లు ఉండరు, అందులో మామామ:—సరి నా యిల్లు బంగారంగానూ..నన్ను యిచ్చింది ఎక్కడో పరాయిచోటకాదు. సయామూ మేనమామకే అని చెపుదామని మొదట అను కుంటూనే అది వదిలి ఎక్కడో ఎత్తుకున్నాను. అంతలో ఉంది నా తెలివి:— ఆఁఅబ్బ! నవ్వకండి కొంటెతనం చేస్తే నా మీద ఒట్టుసుమండి. వదలండి, మాట రానీయకుండా చేస్తే మీతో ఇక ఎన్నటికీ మాటాడను. అమ్మ! అశే ఉహుఁ. ఎప్పుడూ మీకు అదే రంథి! ..అదే మా ఆయన కుంటేనా అందులో వీసపాలైనా..

పల్లెటూరి పడుచుకు అంత ప్రౌఢ తనం..అలా పలుకుతూంటే వగలై చిలికే రసాలు, నేనెలా వదలగలను, ఏనాటి పుణ్యఫలముగానో చేజిక్కిన నిధానాన్ని? కాని ఆమె కాదు. నేను చిక్కింది బలిమితో బలవంతముగా నైనా మరోమారు దక్కించుకోవాలని పెనగులాడినా ప్రయోజనం లేకుండా చేసింది నవ్వుతూ ఎంత ఆగడమైనా చేయగలదు; నన్ను నవ్వించ గలదు, కవ్వించి..

.. మా మామ, అందుకుమాత్రం దేవుఁవంటి వాడే నండీ, ఏ మాట కామాట చెప్పాలి. ఎవరు ఎంతగా అయినా యెద్దేవా చేయనీండి : మొగంమీదనే వరుస, పరాచకంగా ఎన్నైనా అననీయండి. ఆయనకు నా విషయంలో చీమైనా కుట్టదు : మాయ లేదు. మర్మంలేదు.'

'ఇంకా పొగడు ..

'తప్పు లేదు. లేనిది అవునంటే అది కాని : .. ఆయన గుణాలకేం'

'అది తప్ప' ..

'అలా వెక్కిరిస్తే చెంపమీద ఎరుపు చెరగనీయను. నా చేతి చురుకు రుచి తెలుసునా'—

'రుచి మరిగాను గనుకనే :

'ఇక మరచిపోండి. యీ రవంతసేపూ మాటకు అడ్డం రాకండి. కథ చాలా లేదు కాని మీకు వేళమించుతుంది. బుద్ధిగా మంచి బాలునివలె చెవులు దోరచేసుకుని నేను చెప్పే దంతా వింటే చివరకు ఏదో అప్పటికి నాకు తోచింది మీకు...

'నీ దయ ...'

"అలా గుర్రిం చిగండి, గడుసు తనానికి పోక: — ఊం మా ఆయన లాగానే నేనూను : మనసులో ఒకటీ. మాటా డేది ఒకటీ కాదు, చెప్పేది ఎంతో, చేసేది అంతే. నేను చిన్న ప్పటినుంచీ కూడా అంతే,

'ఎవ రేమనుకుని పోతారో అని చీటికీ మాటికీ వెనుదీసే ఘటాన్నే అయితే, నే నీపాటికి యిలా ఉండేదాన్నా ? యింత నిభాయించుకుని వచ్చేదాన్నా ? స్తంభంచాటు రంభనుకాను. అన్నింటికీ చాలిన దాన్ని గనుకనే అమ్మా నాన్నా అంకెళ్ళు నొక్కుకుని ఊరుకున్నారు: అంతకన్న ఏమన్నా అంటే నే నూరుకోనుగదా ? అమ్మమ్మ ... ఏళ్ళువచ్చినదాన్నిగదా, ఏమన్నా అది నామీద తిరగబడవస్తుందా అని మా పాపడు పోరుపట్టి ఏడుస్తూంటే తొట్టె కదిలిస్తూ శాణాతనంగా ఎవరికిపుట్టిన బిడ్డరా ఎక్కెక్కి ఏడుస్తూంది' అని అక్కసు వెళ్ళబోసింది. మా పెద్దవాడి పుటకలకి అందరూ ఆ ముసలి దాన్ని ముందుకుతోసి, ఆమాట కాస్తా అనిపించారు. ఆసంగతి నాకు తెలుసును. ఆపాళాన నేను ఆమెమీద విరుచుకుపడ్డాను. ఝుంయ్-ఝుంయ్ మని ఎవరూ నోరెత్తకుండా పట్టుకు దులిపి-దులిపి వదలిపెట్టాను. కుక్కిన పేనుల్లాగా ఎవరిమానాన వారు తప్పుకున్నారు.

'చెప్పిచెప్పి తగులుకుపోయిందని శాస్త్రం ఉందిలెండి వెనుకటికి : నా తప్పేమి లేదు. అప్పుడే ఆలా అనుకునే, ఆ పెళ్ళికి ఒప్పుకున్నాను. అక్కయ్య ఎందుకు లేచిపోయిందో అందరికీ తెలుసును; దాని మీద ఎవరూ జాలిదలచరేం ? నిజంగా అది నాకన్న నిష్కల్మషమైన మనసుది, మొదాటనే తగినవాడిని చూసి, చేస్తే వంచినతల ఎత్తకుండా దానికాపురం అది చేసుకుంటూ బ్రతికేది. ఆలాకాదని ఆ స్త్రీకోసం ఆశపడి. ఈ అర్జనుడికి దాన్ని అంటగడితే ఏలా తెల్లవారను ? మొగు

డంటూ ఉండీ ఒకటీ. లేకా ఒకటీ అయితే, నగా-నాణెం చూసు కుంటే కడుపు నిండుతుందా? ఎందుకు మళ్ళా కన్నతల్లీ తండ్రీని?... చాటూ మాటూ అంటూ దానికి సరిపడదు. అందుకని మనసుకు వచ్చిన వానితో ఢంకామీద దెబ్బతీసి లేచిపోయింది... ఇక్కడనుంచి లేచిపోయింది. అక్కడ అదీ ఆతడూ సుఖంగా ఓయింటివాళ్లై చిలకాగోరింకల్లాగా చూడ ముచ్చటగా ఉన్నారు.

'... అక్కయ్యే కాదు. ఎవతె మా ఆయన్ను చేసు కున్నా ఆ పని చేయవలసిందే. అంతకన్న మరోదారి ఏముంది? ఆయన పుణ్యం కొద్దీ ఒకవేళ నేనుగాక ఆయనలాగానే ఏ పోడిమీ లేనిదానికి పుస్తెకడితే అప్పుడు యిద్దరూతలో మూలా పడి ఉండి, కొంగజపం చేస్తూండే ళ్ళు. అయినా అలాటి పెళ్ళి..అసలు. ఆయనకు పెళ్ళి ఎందుకు?..

'అందుకనే మావాళ్ళు, మా అదుర్దా పడ్డారు మొద టిలో; ఏవేళప్పుడు యిల్లు నాలుగుమూలలూ చక్కబెట్టుకుని ఎవడినో తీసుకు ఎప్పుడో అప్పుడు పుట్టి ముంచుతానునుని: క్షణం ఏమారకుండా, ఎంతమంది నాకు కాపలా! నేనేం అంత తెలివి తక్కువదాన్నా! వీళ్ళకు అసలు నా మనసులో ఉన్న ద్దేమో అంతు చిక్కనిస్తానా?

'నే నెందుకు లేచిపోవాలి? నాకు యిక్కడ ఏం లోపం ఇవన్నీ విడిచి ఏ దేశాలో పట్టిపోతే, యింత వైభవం ఉండేదా? యిల్లు నాది. యింటి ఆయన నావాడు. యిక్కడ ఉంటే నా

యిష్టం వచ్చినట్లుంటాను. యిల్లన్న తరువాత మరి పిల్లా మేకా ఏమీా లోటులేకుండా ఎవరో ఒకరు చూచుకుపోవాలిగద. ఆయన కడుపులో చల్ల కదలకుండా అంతశ్రమా నేనే పడి ఆయన వంశం నిలవ బెడుతున్నాను. నిజంగా మావాళ్ళకే ఆ యింగితం ఉంటే, రోజూ దీపం పెట్టేవేళకు నాకు చెయ్యెత్తి దణ్ణం పెట్టాలి.

‹అక్కయ్య బ్రతుకలా పాడుచేశారనే కచ్చ కొద్దీకాదు నేనిలాచేయడం:అందరికి బుద్ధులునేర్పే అంతటిదాన్నా నేను?నన్ను చూసి ఎవరన్నా బాగుపడితే..నా లాటివాళ్ళు...నాకు అదే పదివేలు.ఆమె పట్టిననోము లోకమంతా పట్టింది అన్నట్టు వ్రతము చెడదు...ఫలం ఎప్పుడూ దక్కుతుంది.

‹ఇంతా విన్నారుగదా? యిప్పుడు చెప్పండి జవాబు, నేను అడిగినదానికి? ఎందుకు లేచిపోవాలి? అవతల వాడు యింద్రుడైనా చంద్రుడైనా నాసరే పోయి అవతల యింతకన్న బావుకునేదేముంది? మీా మీాద కోపం లేదు. మీారేదో లోక రివాజు ప్రకారం అనుకున్నారు. అన్నీ ఉన్నదానికి మన అదృష్టం కొద్దీ అంటసా అయినాముకదా. అది అంతా మనచేతిలోది: ఎలా ఆడిస్తే అలా ఆడుతుంది. తప్పకుండా వెంటాడుతుంది. మనల్ని చూడగానే కీలుబొమ్మయి పోయింది. సొమ్మంతా కట్టుకుని...రమ్మనకముందే రానీకపోతే విడిచి బ్రతుకలేనని బ్రతిమాలుతుంది. మనమే ఆమాటలన్నీ అంటే, దానికి మమత మరీ చెలరేగి కన్నూ మిన్నూ తెలియక...

'కాదనకండి. అన్నా నేను నమ్మను. కోరి, ఒక్కసారి కూడితే వారు వీరవుతారని సామెత లేదూ? నాకు తెలియవూ మీ వగలన్నీ? నాచేత చల్ మోహనరంగా అని పిద్దామను కన్నారు. అనేదేనాఅంతటి రాలుగాయకాని దేవతే అయినా, మన్మథుని మించిన సరసుడు మనసిచ్చి నందుకు మాటదక్కించు కో వాలంటే, ఘుడు. మూట దక్కించుకో వద్దూ. అవునండీ నేనే యింతటి ఆసామీ భార్యనుకాక ఏ కూలినాలి బికారినో అయితే నజరుగాఉండి. నచ్చితే పిలిచో. పిలిపించుకునో...అం దుకు మీకు తోచిన విలువయిచ్చి, తొలగమనేవారు. మెడను కట్టుకు ఊళ్ళవెంట ఊరేగేవారా? అది లాభసాటి బేరంకాదు. ఇది అయితే మీకు మరియాద. ఊరిమీదికు పోయిన ఉద్యోగి ఉత్తచేతులతో తిరిగి రాకుండ కొత్త పిట్టనోదాన్ని పట్టుకువచ్చా డంటే...వీరెంత ఘనులని...నలుగురిలో మీకెంత మరియాద?

'అన్నీ తెలుసును ఔనసండి. కాదనండి, మా బాగా యెను : అందరికన్నా, మీరేం కొండదిగి రాలేదు. దిగివచ్చినా ఇంతకుమించి వచ్చేదీలేదు.

'. ఇది మీకు కొత్త. నాకు కాదు. అందుకూ అలుక యేనా? అవును మరి. మీరే, నేను మొదాటకోరిన వారైతే మీ మగసిరి కెంతటి బిరుదు? పతివ్రతను పాడుచేసిన గౌరవం వెనుకనే యెవరో తన్నుకు పోయిరి, మీకు దక్కకుండా. అప్పుడు రాకపోతిరి. పోనీ, అయినా... ఆ కొత్తమోజులో నైనా ఇంతే నేను మీతో లేచి వచ్చేదా న్ననుకున్నారా? ఎన్నటికీ... ఊహుఁ...

‹ఎవరూ నాతో యింత నాటక మాడలేదండీ! ఏదో రావడం, ఆవేళకు నాతో అలసి సొలసినందుకు అదే పదివేలను కుంటూ, అలా ఎవరిత్రోవను వారు అతిఆశకు పోకుండా... అడపా దడపా...అదైనా యిందుకోసమనికాకుండా ఏదోమళ్ళా అల్లా కలసివచ్చినప్పుడు ఎప్పుడైనా...

ఆలా ఉంటే కలకాలమూ మనసులో నిలిచి పోతారు. కలిసి ఉంటే మూడో నాటికి మొగం మొత్తదూ ?...

'మా పాప తండ్రి...మా హేమను కన్నవారు, వారి ద్దరూ...మీకు తీసిపోయినవారుకారు. మీ ఫాయాలోనే మీలాగే వచ్చారు; వచ్చినందుకు దైవం తలచినటులుగా వరాలిచ్చారు. అదీ ముచ్చట ...

‹మరి, యీసారి పురుడు పోసుకున్న తరువాత, పేరేం పెట్టమంటారు ? భారసాల చేసుకునే నాటికి కబురు పంపుతాను. ఎంతతీరని తొందరపనులున్నా, మీరు వస్తారు కారూ ? బదిలీ కాకుండా మావాడనే యేలుతూంటే ?...

‹కథ వింటేనే కడుపునిండుతుందా అని, మళ్ళా అందు కోసం మారాంచేసినా...అంతే. ఇకచాలు.

‹నాది కడుపునిండినబేరం. ఎందుకు అలా నేను ఎవరి తోనైతేమూత్రం లేచిపోవాలి? నాకుయింతకన్న ఏంకావాలి?»

మెలకువ తెప్పించి నన్నింత చులకన చేసింది : ... కాని యింకా మెన్నడోగాని మెన్నటికైనా మేమో రాని కాలం ... కథలో గడపకుండా కలగననిచ్చినా, కొంతమేలే ! కాని ఆమె మాటలన్నీ నిజంగా నిజమనేగా ...నాకు చేతగాని తనానికికోపం...

# టు ప్ పీ క

—మేడ మెట్లమీద ఎక్కి వెళ్ళిపోయి గదిలో తలుపులు బిగించుకు కూచుని. ఏరాత్రో చదువో మొదలు పెట్టలేకపోతే... యింకా పై అంతస్తుకు వెళ్ళి, ..ఎక్కడో బజారులో రేగే రొదకు చెవిదోరచేసి... ఏమైనా ఆ మూలుగుమాత్రం వినలేక... ఏమైనా చేసేందుకు, తనచేతిలో ఏమీలేక... తల్లడిలి పోతున్నాడు : అక్కడ నిలవడానికి, తరం కావడంలేదు. పళ్ళు బిగివిని నాలుగుమెట్లు ఎక్కాడు అయిదోదానిమీద అడుగు వేయబోతూండగానే... ఇక, కాళ్లు ఛప్పగా చప్పబడ్డవి. క్రింద నుంచి, మళ్ళా, మూలుగు వినబడ్డది. ఇక అంతటితో, నిలుచున్నవాడుఆపాళాన అక్కడే కూలబడిపోయినాడు.

అంతా— గందరగోళంగా ఉంది, ఆగది దగ్గర;అందరూ కొందరు లోపలా, లోపల యిరకలేనివారు బయిటా చేరి, ఒక్క సారిగా మాట్లాడుతూ రణగుణధ్వని చేస్తున్నారు. అంత మోతలోనుంచి ఉండి ఉండి మూలుగు వినబడుతూంది.

— తాను అది, వినలేదు : పిల్లది ఉద్వేగంగా మూలిగినపుడు లోపలికి జొరబడి పొదివి పట్టుకొని ‹నీకేం భయంలేదమ్మా తల్లీ నేనున్నాను' అని గడచి బయటపడే దాకా, అక్కడే కూర్చుంటే......’

ఊహుఁ .. గుమ్మందగ్గరకు వెళ్ళేటప్పటికి. . అత్తగారు అడ్డంగా నుంచుని, కదలక, మెదలక, ధీమాగా "ఇక్కడ మగ వాళ్ళ ప్రమేయం ఏమీలేదు. . నీవు అవతలికి వెళ్ళు ?" అని, ఉన్నసందుకు చేయి అడ్డం జాపింది : ఆమాట లెక్కసేయకుండా ఆలాగే, లోపలికి, నిలుచున్న చోటనుంచి అంతమేరా సాగి. . తొంగి చూశాడు. అమ్మాయి ముఖం మాత్రము, కనబడ్డది .. "నేను చచ్చిపోతున్నాను, నాన్నో !" అని, గావుకేక వినబడ్డది. ... తనకు యిక గుండె ఆగక... బావురుమన్నాడు. అత్తగారు అందుకైనా చలించకుండా, కనికరం జాలీ, ఏకోశానా లేకుండా, నిర్లక్ష్యంగా అవతలకు ... దృఢంగా నెట్టివేసింది. మూతి నాకడానికి ఎగిరి...ముట్టెమీద దెబ్బతిని... కంయి, కంయి...మనకుండా తోకముడుచుకునే పరువుగా అక్కడనుంచి బయటికి వెళ్ళిపోయే జాతికుక్క...దానికి నోరూ వాయీలేదు...దానిలాగునే...ఉన్నా...తాను లోపల కుమిలి పోవలసిందే...

అక్కడ, అలా దిగులుగా, మోకాళ్ళమీదకు తలదించుకొని కూర్చుంటే, ఒక్కరూం వచ్చి ఓదార్చరేం ? ఆ అల్లుడు వెధవాయ, అవతల గదిలో కూర్చుని ఫోను విడవకుండా పాడిస్తూ...చక్రం తిరగవేసే వ్యవధిలో, కూనిరాగం అఘోరిస్తో... అక్కడలా భార్య... పెళ్ళికూతురులాగా... చెంగ్ మంటూ తానక్కడ కూర్చుని ఉండగానే ... పది తడవలు, తనని రాచుకుంటూ .. తప్పుకోమని అయినా అడగకుండా .. పైకీ

క్రిందికి పరుగులెత్తింది. పలుకరించేందుకన్నా .. ఏం, అలా కూర్చున్నావని, ఒక్క ముక్క అనడానికైనా, ఆమెకు సంబరం లో .. అసలు తానక్కడ ఉన్నట్టు కనబడితేనా .. ?

అమ్మాయి, అక్కడపడుతున్న బాధవినలేకపోతున్న కొద్ది .. తనలోకి .. తానుగా .. వెనుకకు వెళ్ళిపోయి .. మనసులో ..

అప్పటి ముచ్చట తానూ, తన నిర్వాహకానికి .. తల క్రిందులై పోతూంటే .. చీమన్నా కుట్టనట్టుగా కుదురుగా కూర్చున్నాడు. మామగారు, ఎదురుగుండా నూతిగట్టు అరుగు మీద .. తాపీగా చుట్టకాల్చుకుంటూ, పాదాల దగ్గిర రెడ్డిగం వేసుకుని కూరున్న పాలి కాపుతో ... అంతకు మించి, ముహూర్తం కుదరనట్టు... అప్పుడు వ్యవహారం వెలిగిస్తున్నాడు.

ఇక, తనభార్య...నూ, చిన్నతనం... తెలిసినంతవరకూ యింతకన్న ... యిప్పటి వాళ్ళకన్న ... ఎక్కువ ముద్దూ ముచ్చటతోటే ఉన్నారు

కన్నులు బాగా తెరవక ముందే...గారాబాల కూచి గనుక... కాపురానికి వచ్చింది. యిద్దరికి బాగా పసితనమే... పైన కనిపెట్టి చూసే పెద్దలు...ఆకాశంలో ఉన్న. వారి, వారి పెద్దలూ తరించేందుకు...పండుగల్లో అదొకటిగా పడకలు

ఏకంచేశారు.కడుపు,పండితే ఆపండును చూసుకుంటూ,కన్నులు న్నందుకు...

అందరి తపమూ ఫలించినది. అనుకున్నంత పనీ జరిగింది. ఇక...అమ్మాయికి సూడిదెలూ...అసలు. ఒక్కపిల్ల అందుకని...అరచేతుల్లో పెట్టుకు పెంచారు ఇక. .అక్కడనుంచి నె త్తినే పెట్టుకుని...అంటే - అమ్మాయి; ఓపలేనిది ..ఎక్కడ అరిగిపోతుందో అని అతి గారాబంగా...సరి. అదంతా బాగా నేఉంది...

తానూ...అందలం లోంచి దిగలేదు:

— ఆగడియవచ్చింది.

అక్కడ...లోపల...మామగారితో, అత్తగారు... 'అమ్మాయి... యిందాక నుంచీ... కొంచెం నలిగి ఉంది: ఆడేపొద్దులే...ఎందుకైనా మంచిది...... కేకేసి రండి... అనడం విన్నప్పటినుంచి, బిక్కమొగం వేసుకొని.. అటూ యిటూ తిరుగుతూ... ఆవాళకూడా, మామూలుగా భార్య, గదిలోకి నిద్రవేళకు...వస్తుందికదా. అప్పుడు చేతనైన ఉపచారం చేయవచ్చునని, ఆదుర్దాగా, అక్కడే తారట్లాడుతూ... అడుగులు లోపల చప్పుడుకాగానే... ఆమె...వస్తూందని...ఆలకిస్తూ... ఆవలింతకు...చేయడ్డము పెట్టుకుని ఆపుకుంటూ...

అత్తగారు..ఏదోపని మీద. .ఆవేపునుంచి మరోగదిలోకిపోతూ, తన్ను చూసి. .పోయి పడుకోనాయనా, ప్రొద్దు

పోయింది. .అమ్మాయికి . . బద్ధకంగా ఉంది . . అది యిక్కడే పడుకుంటుంది . . ఆనక లేద్దుగానివిలే . .' అంది. అంతలో ఆరాటం హెచ్చి . . ఆ అమ్మాయి పడుకున్న చోటికి . . ఒక్క అంగలో వెళ్ళాడు. . సన్నంగా మూలుగుతూంది: మీాద చెయివేసి , .ఏమేమో అడగబోయినాడు: ఉలిక్కిపడి. . కళ్ళు తెరిచి చూసి. . పళ్ళు బిగించుకుని నిట్టూర్పు విడిచి - ప్రక్కకు ఒత్తిగిలి - పడుకుంది.

— అత్తగారు - అంతలోనేవచ్చి - వెనుక నుంచి పకాలుమన గానే - తగని బిడియం వేసి, అక్కడనుంచి - తల వంచుకుని - వచ్చేస్తూన్నాడు. మంత్రసాని, లోపలికి వస్తూంది మామగారు, అంత పెద్దవాడు, మర్యాదస్తుడు. .తనపంక కొంటె కోణంగిలాగా చూసి - వినబడేట్టు గొంతు సవరించుకుని అదిగో ఇవాళలాగానే అక్కడే అదే మాదిరి - ఆ అరుగుమీా దనే బాసిపట్టు వేసుకుని - చుట్టకొన కొరుకుతున్నాడు. .

ఏం చేయడానికీ తోచడం లేదు ఎంత అణచుకుందా మన్నా, ఆగక, వెక్కి వెక్కి ఏడుపు, పెగుల్చుకు వస్తూంది. ఎవరూ వినకుండా - ఎవరికి కనబడకుండా, తోటవెంటా, దొడ్డి వెంటా, అంతసేపూ, కాలుగాలిన పిల్లిలాగా తిరుగుతూ, తోచిన దేవతల కెల్లా మ్రొక్కుతూ. .ఎంతసేపో. . వేళ తెలియలేదు

. .అమ్మాయి, భూమ్మీాదపడ్డది, తెల్ల వారుతూండగా. ఆమాట, తాను ఏమూలో ఉండగా, ఎవరో వెదుక్కుంటూ వచ్చి, చల్లగా, చెప్పారు:

మంచి నక్షత్రం; ఏవిధమైన శాంతి - దోషమూ లేదు. అందుకని, తెల్లవారిన తరువాత ఆ గదిలోకితానొకసారివెళ్ళి, పిల్లనూ, తల్లినీ - చూడవచ్చునన్నారు.

కందగడ్డలాగ ఉంది - కనుముక్కుతీరు. ఏం - కనబడ లేదు- పొత్తిళ్ళలో అణగి మణగి, అమ్మ ప్రక్కను, నీళ్ళు పోసుకుని అప్పుడే, పడుకుందట : మోకాళ్ళమీదికి బట్ట ఎగ లాక్కుని జేనెడు పీటమీద గొంతుకూర్చుని - అక్కడ కని పెట్టుకుని ఉన్న ముసలమ్మ, అచ్చంగా నీ పోలికేరా బాబూ ! ఆ జుట్టూ - ఆ నొసలూ - ఆ గొంతూ - అన్నీ అచ్చంగా నీవే - అమ్మాయి పోలిక ఒకటీ అబ్బలేదు. ఆడపిల్లకూ - అదీ ఒక అదృష్టమే . . ఆవిడకు ఉత్సాహంతో బాటు గొంతుకు రెచ్చిపోతూంది. ఆ గొడవకు, తనభార్య, కన్ను తెరిచింది.

కనబడేటట్టు, యింకా ముందుకు వెళ్ళి నిలుచున్నాడు.

తెరచిన కన్ను, తనను చూసీ చూడగానే, మూసు కుంది.

కాని, ఆ రెప్పపాటులోనే, అలా ఆ చూపులో . .

. . అమిత భయం, తలచుకుంటే జలదరించి పోయే అసహ్యమూ , కళ పెళలాడినవి.

తల్లికావడంలో, అంతకుముందు ఆయాతన కలలో అయినా ఊహించని తలమునుకలైన హడలు, అమాయకు

రాలు, తన భార్యలో, ఆ క్షణంనుంచీ, అలాగే, నిలిచి పోయింది.

బాలింతతనము తీరిన, మొదటిరోజుల్లో, మరీనీ : తాను కంటబడితే, దయ్యంమీాదకు వస్తూన్నంత భయంతో, దద్దరిల్లి పోయేది : కాలం గడచినా, ఎన్నివిధాల అనునయించి, ఆ భయం తీర్చాలని, తన శాయశక్తులా ప్రయత్నం చేసినా, ఎన్నికలో, మన్నికలో మామూలుగానే ఉండేది : కాని, మనసుపట్టలేక,ఆమాట ఊసు ఎత్తే సరికి, అక్కడితో ఆమెకు వెర్రి లెత్తుకు వచ్చేవి.

ఎవరితో చెప్పేసంగతికాదు : ఎవరూ తీర్చేదికాదు..

ఏమిచేసి -ఆమెను మళ్ళాదోవకు మళ్లించాలో, తోచ లేదు-

ఎన్నో పుస్తకాలు చదివాడు - ఎన్ని ఉపాయాలో ఆలోచించాడు.

ఎందరెందరినో - ఏదో కథగా - ‘దీనికి విరుగుడు ఏం ఉంటుంది’ - అని - శాస్త్ర చర్చగా - కదలేసి చూశాడు : ఎవరికి తోచిన ఉపాయాలు వారు ఉపదేశించారు కాని, వేనివల్లనూ వీసం ఎత్తు పని జరగలేదు-

ఆ అమ్మాయిలో - అంతకు మించిన మార్పేమీా లేదు.

అనురాగానికీ - ఆదరణకూ - ఆమె తనకు-ఆ విధంగా ఎన్నడూ - ఏలోటూ చేయదు :

కాని - అదొక్కటే, తీరనిలోటు.

ఆఖరికి - ఇక ఆ మాట తలపెట్టకుండా అమ్మాయి ముద్దుమురిపాలు చూసుకుంటూ అలాకాలం వెళ్ళబుచ్చడమే యీ జీవితంలో , , ఆ తొలి రోజుల ముచ్చటయేగాని, మళ్ళా అంతఅదృష్టం పట్టే యోగం కరవైందని-రూఢి పరచుకున్న తరువాత - అమ్మాయిని చూసుకుంటూ - యిద్దరూ, అదోమాదిరి హాయితోనే బ్రతుకుతున్నారు. పిల్లదానితో బాటు - పెరిగి పెద్దవాళ్ళవుతున్నారు. అంతేగాని-అంతకు మినహాగా మారిపోయేందుకైనా - అనుభవం అంటూ ఏదీ ?

తన - నడినెత్తిన - వెనుకటికన్న కొంచెం - జుట్టువత్తు తగ్గి పలచబడుతుంటూ వస్తూంది : తన భార్య - అప్పటికన్న కొంచెం బొద్దుగా ఉంది - నిగనిగలాడే ఆమె మొగమూ, నున్నసి బుగ్గలూ - చూసి- ఎన్నడన్నా ఓనాడు - ఎన్నిఏళ్లకో ఓమారు మనసులో - చిన్నతనం - జ్ఞాపకం ఆగక - బెల్లించబోయినా - బెట్టుచెడి - గుట్టుదాగకపోవడమే కాని , , సరి - ఏమనుకుంటేనేం - ఏనాటిపాపం ఏమో, పుణ్యమో, ఎవరి ఎడబాటుకు ఏజన్మంలోనైనా, తాను కారకుడో ఏమో, యీనాటికి, తనదోషం ఏమిలేకుండానే, తనకు, తనతో ఆమెకూ, సౌఖ్యపడేయోగం కరువవడం.

అయిపోయిన దానికి కాదు, ఆలోచన . .

—అమ్మాయి, అల్లారుముద్దుగా, వాళ్ళఅమ్మకు వాళ్ళ అమ్మా నాన్నా చేసినదానికన్న ఎక్కువ గారాబంతో పెరిగి పెద్దదయింది.

తాను, యిల్లరికం. తనతో బాటు, తన అల్లుడూ యిల్లరికం. ఆ యింటనే, ఆలా ఎన్ని తరాలదాకా అయినా ఉండేందుకు అన్ని విధాలా వసతి ఉన్నది.

. . అందుకు కాదు, అనువాయత తప్పకుండా వస్తుందేమో, అని తపించిపోతూన్నది, అందుకూ: అత్తవారికి తన భార్య తరువాత మళ్ళా సంతులేదు, అంతే దేవుడిచ్చాడో, లేక_

అలా అనుకున్నప్పుడే, గుండె తల్లడిల్లుతూంది. ఆయింట ఉన్న ఆడదానికి, కదళీవంధ్యా, దోషం, . అమ్మాయికీ, తల్లీ ముత్తవల, చాలిక, తప్పదా ఏం ? చిలకా గోరింకల్లాగా, వాళ్లైనా, యిల్లు పదియిళ్లయేటట్టుగా, కలసి కడుపు ఫలింపజేసుకోకుండా, తమ లాగానే, తయారవుతారా. .

ఆ మాట, ఆ ఆలోచనే, భయంవేసే సుడిగా తలలో, తనలో, తిరిగిపోతూ, మిగతా ఊహల నన్నింటినీ పీల్చుకుని ముంచేస్తూంది. అమ్మాయి జీవితం తమలాగా కాకూడదు. ఆ కోరికే ఉపాంశువై, జపమాతూంది; తన నిలువెల్లా అదే కోరిక,

—అమ్మాయి - అక్కడ మరీ మూలుగుతూంది - కొం డలపెట్టిన వస్తూన్నాయి- నెప్పులు-తన పేరెత్తి పిలచి-గగ్గోలవు తూంది - తండ్రి - దగబోలూను! తాను ఉండి - ఏం ప్రయో నం?

అక్కడ ఉండలేదు . .

అప్పుడే తూరుపు తెలావెలా బోతూంది.

అంతసేపూ రాపాడిన మనసు - ఆకలిలో - ఆలోచన లన్నిటినీ మింగేసి - తనలో తాను హరించుకుపోయింది - ఎంత సేపు ఎక్కడ తిరిగిగాడో - ఏ మాత్రమూ తెలియదు - కాళ్ళకు - బుద్ధివచ్చి - వాటంతట అవే, మళ్ళా యింటికి మ ళ్ళించుకు వచ్చి, విడిచినవి.

ఎండ ఎక్కుతూంది.

లోపలికి వెళుతూంటే, శకునపక్షిలాగా మామగారు రొంటిన చేతులు పెట్టుకు రొమ్మువిరిచి నిలుచుని, చూడగానె, బిగ్గరగా సకిలించి, ఎకసెక్కెంగా, తాతగారూ దయచేయండి' అని పక్కకు తప్పుకున్నాడు, అత్తగారి ముఖం, కలకలలాడు తూంది. తనభార్య, . ఆమెవంకనైనా, చూడకుండా మాత్రిం పురుడు వచ్చినగదిలోకి, వెళ్ళి ముసలివాడవుతున్నా ననుకున్న వాడల్లా పసివాడల్లె, చూసి పొంగిపోయినాడు అమ్మాయి పసిపాపను పక్కన బెట్టుకుని, దాని తలమీాదుగా, తన చేయి

తలగడ జేసుకుని, జాపి మునివేళ్లతో, దగ్గరగా కూర్చుని, మీదనా వాలినట్టుగా, ఏదోకబుర్లు చెబుతూన్న, మగని చెక్కిలికి, చక్కిలిగిలి పెడుతూన్నది. ఇద్దరూ, నవ్వుకుంటున్నారు. .

అమ్మాయి, కొంచెం నీరసంగా ఉన్నది కాని, దాన్ని కమ్మేసే, కొత్త అందం, కొత్తకళ, ఓడిపోతూంది. అక్కడనుంచి తప్పుకుందామనుకున్నాడు. తానలా చూస్తూనిలుచుంటే వాళ్లు ఏమనుకుంటారో ? పసివాళ్ళు . . బిడియపడి . .

అమ్మాయి, తనవంక చూసింది. చూపు తిప్పుకుని కనులతో, మగనికి సైగచేసింది. ఆతడు, తిరిగిచూసి, నవ్వి తను ఉన్నానని అయినా సిగ్గులేకుండా, భార్యను ముద్దుపెట్టుకున్నాడు. అమ్మాయి చెయి, ఆతని, మెడమీదకు వాలింది.

అక్కడ నిలుచునేందుకు, ఎందుకో మొగం చెల్లక యివతలకు వచ్చేశాడు. — అల్లుడూ, కూతురూ, మునుపటికన్న ఎక్కువగా . . పసిదానికి మూడు నెలలు వెళ్ళినప్పటి నుంచీ, చెట్టాపట్టాలు వేసుకుంటూన్నారు. పసిదాన్ని, వదిలేశారు : అవును ఎందరున్నారు. నెత్తిన ఎక్కించుకునేందుకు, తన అత్తా, మామా యిల్లాలూ, పసిపాపకు, - అంగరక్ష. తన జోలి ఎవరికీ అక్కరలేదు. తనవంక చూసేవాకీ లేరు.

. . ఉదయం నిదుర లేచి, లోపలినుంచి, తోటలోకి రాబోతూంటే, అంతచీకటిలోనూ, అమ్మాయి, అవతలగా

వసారా చివరను కూర్చుని, చెవులు మూసుకుని, కళ్ళు-కుంటూంది.

పరుగెత్తుకు వెళ్ళి, నీళ్ళు తీసుకువచ్చి, ఆమె పక్కన ఉంచి, కూర్చుని, వెన్ను రాస్తున్నాడు. పుక్కిలించి ఉమ్మేసి, లేచి నిలుచున్నది. తూలి పడుతుందేమోనని, పట్టుకోబోయి నాడు: 'అక్కరలేదు. నాన్నా' అన్నది: 'ఏం, తల్లి, ఎందు చేతనమ్మా..' ఎంతో ఆదుర్దాగా అడుగుతూ. తల నిమురు తూన్నాడు: అమ్మాయి, తనవంక చూసి, చిరునవ్వుతో, తలవంచుకున్నది. 'పోయి, పడుకో అమ్మా' అని గది దాకా సాగనంపి, క్రిందకు దిగి, చరచరా లోపలికి వెళ్ళాడు. వంట యింటి పక్కన వసారాలో, అత్తగారు. కాఫీసామాను చుట్టూరా పరచుకుని ఆ ప్రయత్నంలో ఉంది. భార్య, ఫలాహార మేదో తయారుచేయడానికి, నాలుగూ చక్కబెడుతూంది: మామగారు, ఎదురుగుండా తులసికోట చప్రామీద .. కూర్చుని, కబుర్లు పేనుతున్నాడు..

అనంతా చూస్తే, మండుకొస్తూంది, అక్కడ అమ్మాయి, అలా ఇదవుతూంటే, దిక్కూ మొక్కూ చూడ కుండా, యిక్కడ వీళ్ళు

ధుమధుమగా, అమ్మాయి, వెళ్ళబోసుకుంటూంది. అని తన భార్యకేసి ఉరిమాడు.

అప్పుడు, తాను గుమ్మంలో నిలుచున్నట్టు, అందరూ గమనించారు.

భార్య, తల ఎత్తి తనవంక చూడనైనా లేదు. మాట వినిపించుకోలేదు.

అత్తగారు, తనలో తాను ఏమో గొణుక్కుంటూ నీళ్ళు ఉడికినాయోలేవో, అని మూతతీసి చూస్తూ, ఆ ధ్యాసలో ఉంది.

మామగారు, గరుసెక్కిన గడ్డం, అరచేత్తో ఎగువకూ దిగువకూ తడుముకుంటూ, ఎవరిని ఉద్దేశించి కాకుండా, ఎటు వైపూ చూడకుండా, ఏదో మాటవరుసగా, 'అలాగా పాపం, దానికి, అంతేకావాలి, ఏడాది కోసారి అంతేకావాలి' అని ఆడవాళ్ళవంక చూస్తూ, 'ఎందుకూ మీరూ ఉన్నారు, గళ్ళే పసరాల్లాగా, చూడండి, మీకన్న ఎన్ని వెనుకలు చిన్నది, మరి చిచింద్రిలాగా. చూపిస్తే, అందుకు పోతూంది, అదీవరుస, అలా ఉండాలి, అదీ దాన్ని, మించినఘనుడు నీ అల్లుడూ, ఎందుకు మళ్ళా మనమూ ఉన్నాం తగదుమమ్మా అంటూ.

ఈ వరుస అంతా, తనకేసి చూస్తూ, పనసలాగా ఏక రువు పెడుతున్నాడు, తనకు తలదీసివేసినంత పనవుతూంది.

అమ్మాయిఅక్కడకువచ్చి వెనుక నిలుచుని ఉంది, తాతగారు . . ఉన్నదానవు, ఉన్నట్టుగా ఊరికే ఉండలేవుటే?

నీయిల్లు నిలువెత్తున బంగారంగానూ, నీకు తెలియకపోతే, మీ అమ్మమ్మనూ, అమ్మనూ చూసి నేర్చుకో రాదూ, పోనీలే చెపితే వినే నేర్పుఉంటేనా, యీ కాలపు పిల్లలకు మరీ రెచ్చి పోతున్నారు సరేలే, ఏలాగూ తల పెట్టావు, కనుక ముందు ఓ గంపెడు కూతుళ్ళనూ, తరువాత కొడుకుల నెత్తుదువుగాని మావారడీ, నీవారడీ, అంతకూ నీవే తలచుకోవాలి, ఎత్తుకు నెత్తిన చూసేందుకు ఎదిగిన పిల్లలం యింట్లో పసాటా లేకుండా. మేం ఉన్నాముగా. .

మనమరాలిని, అన్నీ అని, వెక్కిరించాడు. అమ్మాయి బుంగమూతిచేసుకుని, అందరితో పాటుకలసి అంతలో నవ్వేసింది.

అకిలకిలే అపవలంతా, తనతలలో గిలగిల లాడుతూంది. కవ్విస్తూంది బయట చీకటిపడినా. మనసులో మసక బారలేదు. వెన్నెలవుతూంది:

ఆరాత్రి, అడుగులు తడబడుతూ, తబుకులో తాంబూలం ఉంచుకుని తన భార్య అన్ని యేళ్ళయిన తరువాత, తన దగ్గరకు తనకోసం, వచ్చింది తలవంచుకుని నిలవబడినది. తానూ తలవంచుకున్నాడు. .

తల్లో. . అంతవరకూ అలవికాని కలలన్నీ, పలక బారి నవి కాని కలలు కలకలలాడకుండా, నోయని నోములు, వాటిలో

ఒక్కటి అయినా మిగలకుండా, చెల్లాచెదరు చేయబోతూన్నవి. అందులో, ఒక్కటి దక్కినా, ఆ జన్మాలకు, ఎంతో ఎక్కి దక్కి,

—మనసుతో బాటు, చేతులూ, తన ప్రయత్నం లేకుండా ముందుకు జాచుకుంటూన్నవి : అందుకో బోతూండగా . .

అమ్మాయి, తమిద్దరినీ చూసి, నవ్వుతూన్నట్లు, ఆ నవ్వు జ్ఞాపకం వచ్చింది, చేతులు జాలిపోయినవి.

తలఎత్తి, ఒకరినొకరు చూసుకున్నారు. యిద్దరిచూపు ల్లో, ఆశను దక్కించుకోలేని, అమాయికత్వం, పండించిన ముదుసలి కళ, తెలివై, మెరిసింది : యిద్దరి నిట్టూర్పులూ దేనికదై ఒకటై, ఒకదాని కొకటి చిక్కకుండా, దేని తోవను అది ఆ గాలిలో దోవచేసుకున్నవి. .

తనభార్య, తలమరీ వంచుకుని, అమ్మమ్మ అమరిక అయిన ఒదుగుతో, పెద్దతనంతో, తిరిగి, తిరిగిచూడకుండానే యింట్లోకి వెళ్లిపోయింది తను, ఇంతే ఎప్పటికి మల్లె, తానే. .



# కథ

౧

‘ఉహుఁ, నేను రానంటూంటే ఎమిటి ఊరికేను ? నీవు వెళ్లరాదూ, నన్ను బ్రతిమాలకపోతేను ?’

‘రావూ ?’

‘ఉహుఁ’

‘ఎప్పుడూ కూర్చుంటే ఏం తోస్తుంది. . రా పోదాం’

‘నేను—రాను’

‘నామాట వినవూ ?’

‘నామాట నీవు వినరాదేం ? మహా . . నేర్చుకుంటూ న్నావులే’

‘పోనీలే అమ్మ! నేనూ మానేస్తాను. ఎంతో సరదాగా పిలుస్తూంటే, నాముచ్చట తీర్చడానికైనా రావచ్చునే’

‘నేను రానే. . ఏమిటి . . . ఓ . . . సొద నేను లేకపోతే కోవిలకూయదా, పూలు పూయవా, వెన్నెల కాయదా ? నే నెందుకూ ? నీవే పోయి అనుభవించరాదూ, ఆవైభవమం తాను’

‘వల్లకాదు . . .’

'పోనీ. . మానేయి, ప్రతిపనికి నాతో వంతేనా ఏమిటి?'

శాంతకు కోపం వచ్చి, ఇక అక్కడ నిలువకుండా, వెళ్ళి పోయింది. వనం — వనలత—ఆమె వెళ్ళిపోవడం చూసికూడా మాటాడకుండా ఊరుకుంది.

'ఎందుకూ పనికిరాకుండా . . ఎవరికీకాకుండా . . ఈలా అయిపోతున్నానేం ?'

-కనుకొలుకుల్లో ఒకటిరెండు ముత్యాలు కనిపించినవి వనానికి. పైట చెరగుతో తుడుచుకోవలెనని యత్నించి మరల మానుకున్నది. ఒకటి . . రెండు . . ఇక బాష్పధార . . ఆవేశాన్ని ఆపుకో లేక పోతున్నది . .

'ఎందుకు . . ఈ . . లా బ్రతకడం. . ఏమున్నదని . . ?

'అక్కయ్యా ! . . వనం ! . . ఇదిగో నిన్నే . .'

—ప్రభావతి నవ్వుతూ పరుగెత్తుకుంటూ వచ్చింది . .

'మరే . . రమేశమే . . అన్నీ బడాయిమాటలేనే ! . . రెండుగేములు గెలిచాను . . పట్టినాయనమ్మ ! నాతోనే ఓడి పోయినాడు'

చిన్ని చెల్లెలిమాటలకి, ఆ విచారంలోనే, వనానికి నవ్వువచ్చింది.

'అలాగేం!..'అన్నది, ప్రసన్న భావం అభినయిస్తూ.

'మళ్ళా ఆడమన్నా! ఎప్పటికైనా సైం గెలవలేని కుక్క గయ్యాళికుక్క.. పారిపోయి, అమ్మదగ్గర దాక్కున్నాడు. రమ్మను .. చేతనైతే'

... ... ... ...

'అబ్బ! నేనురావాలా ఏం .. అక్కడ ఎవరులేరూ..'

'ఎవరున్నారమ్మ, నాన్నగారు షికారు వెళ్ళారు, రజాక్ కారు తీసుకెళ్ళాడు. ప్రకాశం స్టేషనుకు వెళ్ళాడు, మరి తాతయ్యగారిని రమ్మననా ? ఆయన లేవనే లేడాయెను ..'

'ఎందుకూ అంతచదువు ? వస్తానులే ..'

ప్రభ ముందుదారి తీసింది. వనలత నెమ్మదిగా ఆపిల్ల వెనుక అడుగులు వేస్తూన్నది.

'అదిగో చూడు—ఆ కొమ్మను .. ఉహుఁ .. అది కాదే .. నీలాంబరిమీదుగా .. ఆ ..' .. అదే .. నీవు కోస్తూండు. .నేను గులాబీలు తీసుకువస్తాను. .కోసి. .ఫౌంటెను దగ్గర పెట్టివచ్చాను కాని. . అన్నీ కోయి. .నాకే .. శాంతము చూపించవోక ..'

ప్రభావతి పరుగెత్తుకుని పోయింది. వనం ఆ కొమ్మను బాగావంచి, బాగావికసించిన ఓపువ్వుకోసి, రేకలు త్రుంచివేస్తూ, తలవంచుకుని అక్కడనే నిలువబడి పోయింది.

'వనం ! . .'

ఉలికిపడి చూసింది. కాంతం, ఆమెనే చూస్తూ, చాలా దగ్గరగా నిలుచుని ఉన్నాడు. ఎప్పుడు . . ఏ మూలనుంచి వచ్చాడో . .

'ఎంతకాలం . . వనం'

ఆమె ఏమీ మాటడలేదు. మళ్ళా తలవంచుకున్నది. కాంతం ఆమెచెయి పట్టుకున్నాడు : అతని చేతిమీద కన్నీటి చుక్కలు రాలినవి . .

'ఎందుకూ . . తలఎత్తి . . ఈలా చూడు, వనం !'

వనలత వెక్కి వెక్కి ఏడవ మొదలు పెట్టింది . . కాంతం ఆమెను సమాశ్వాసించాలనే యత్నంతో . .

'ఊరుకోవూ . . !' అన్నాడు చాల నెమ్మదిగా . .

'నామాట వినవూ . . ఎందుకూ . . ఊరుకోవూ'

వనం వంచినతల ఎత్తలేదు. కాంతం ఎన్నోవిధాల ఆమెను బ్రతిమాలాడు. ఆమె మారుపలుకనయినా లేదు . .

'వనం !..'

ఆపలేని ఆవేశంతో, కాంతం ఆ అమ్మాయిని కౌగిలించుకోవలెనని ప్రయత్నించాడు . . కాని అతని బాహువల్లరిలో

చిక్కకుండా తప్పించుకొని . . తేలకన్నులతో ఆతన్ని చూస్తూ జాలిగా . . వద్దని తల ఊగించింది. కాని, కాంతం చూసీకూడా చూడనివాడిలాగా. .ఆ మెను. .కౌగలించుకుని. . పెదవి ముద్దిడు కున్నాడు. మళ్లా. . మళ్లా . .

ప్రభావతి పరుగెత్తుకుంటూ వచ్చింది. ఆతన్ని తప్పించు కోలేక. . ఆతిని కౌగిలిలోనే ఉన్నది, వనలత . .

. .ప్రభావతి నవ్వుకుంటూ. . ఒక్క పరుగుతీసింది.

౨

'నిన్నుజూచి. . ధన్యుడైతినీ. . నీరజనేత్ర. .'

పాడుతున్నది. ఉహూఁ, విచారమంతా ఆ కొంచెంసే పయినా మరచిపోవచ్చునుకదా అని. . పాడుదామని ప్రయత్ని స్తున్నది; కాని సాగడంలేదు. వ్రేళ్ళు ఆడటమే లేదు. చివరకు, వినువుకుంటూ పాటచాలించి, వీణెను సోఫాకు ఓరగా ఆన్చి, తాను అలా ఓప్రక్కకు ఒరిగింది, వనం.

చీకటిపడింది. మేడంతాకూడా దీపాలు వెలిగినాయి, కాని, ఆ గదిలోమాత్రం దీపం లేదు. . ఫాన్‌మాత్రం ఆడు తూంది.

ఎదుట పోర్టికో తలుపు తెరిచిఉన్నది. గోదావరిమీాద నుంచి చక్కని గాలి వస్తూన్నది. . ఏటినడుమనుంచి, గాలి

వాటు ఉన్నప్పుడల్లా, అవ్యక్తమధుర ధ్వనిలో పడవవాళ్ళ పాటల చరణాలు, అక్కడక్కడ వినబడుతున్నాయి. రొప్పుకుంటూ, వంతెన నంతా ఊగిస్తూ, పాసింజరు పరుగెత్తింది. చల్లగాలికి గోదావరిఒడ్డుకు వచ్చి కూర్చున్న పిల్లవాళ్ళల్లో ఎవరో, గొంతెత్తి చక్కగా పాడుతున్నాడు. .

"ఓబిలేశుని కొండలనడుమా

వంచెగడ్డి కోసేదానా

వంచెగుడ్డా, వల్లెగుడ్డేమే. .

వినపడుతున్నదికాని, వనలత వినిపించుకోవడం లేదు. ఏదో ఆలోచించుకుంటూ, ఎక్కడో, ఏధోరణిలోనే ఉన్నది.

"గిద్దెలగిరీ కొండల నడుమా

ఎద్దులకాసే...ముద్దులమరదీ

నన్ను చూసీ నవ్వబోకోయి...హరిఓబిలేశా"

వనం...అప్రయత్నంగా ఆలపించింది. జాలిగా విని, నవ్వుకున్నది అహోబిల నారసింహుడుకూడా., ఆడవాళ్ళ కోసం, అంత అవస్థపడుతాడుకదా అని. .

"కట్టమీాదనుం చెళ్ళేదానా

కాలుకురచా చిన్నదానా

కమ్మలిస్తా వెంటవస్తావా..."

—వసం చివాలున లేచి నిలుచున్నది. పాడేవాడి మీద, ఆపాటమీద ఫెళ్ళున కోపం వచ్చింది. తలుపు మూసేద్దా మనుకుని ముందుకు ధూకుడుగా వెళ్ళింది. కాని పోర్టికోలో అడుగు పెట్టేటప్పటికి, చల్లగాలికి ప్రాణం లేచివచ్చి, ఆలాగే నిలువబడిపోయింది. ఓ స్తంభాన్ని ఆనుకుని, ఉదయించాలని యత్నిస్తూన్న బాలచంద్రుణ్ణి చూస్తూ.

చూస్తూ—చూస్తూ..ఆచూపే క్రిందకు మరల్చింది. గోదావరిఒడ్డున ఇంకా ఎవరో చాలామంది అక్కడక్కడ కూర్చునే ఉన్నారు. మనుష్యులు కన బడటం లేదు కాని, సిగ రెట్ల వెలుగు చూచాయగా గోచరిస్తున్నది.

క్రొత్తబులబాటం కాబోలును, ఎవరో.. స్కూలు పిల్లవాడయి ఉంటాడు..టార్చిలైట్ మాటి మాటికి వేస్తున్నా డు. ఆవెలుతురితో, భూమ్యాకాశాలు అలవి అయినంత వర కూ పరీక్షిస్తున్నాడు. ఓమారు వసం చాయలకూడా వచ్చింది వెలుతురు. అప్పుడు చప్పున ప్రక్కకు వొరిగింది ఆఅమ్మాయి.. మళ్ళా చీకటి అయింది.

ప్రక్కగదిలో శాంత ఉన్నది, అలంకరించుకుంటూ గదిలో దీపం ఉన్నది, సన్నని గొంతులో ఏదో పాటకూడా వినిపిస్తూన్నది.

ఒక్కమారే పాట ఆగిపోయింది. దీపం ఆరిపోయింది. ఉన్నట్టుండి మళ్లా వెలిగింది, మళ్లా ఆరిపోయి, మళ్లా. .

వనానికి అప్పటికి అర్థమయింది . . ఒక్కపరుగున లోపలికి వెళ్ళి స్విచ్ వేసింది. . గదంతా వెలుతురయింది

'శాంతా. .'

'అక్కయ్యా !. .'

పైటపిన్ను అమర్చుకుంటూ శాంత తనగదిలోనుంచి బయటికి వచ్చింది. వనలత ఆ అమ్మాయని ఉరిమిచూసి,

'ఏమిటాపని' అని గర్జించింది.

శాంత. . గోహార్ పోజుతో. . అలాగే నవ్వి,

'ఏమిపనా. . పాడుపని. .' అని తన గదిలోకి తిరిగి వెళ్ళిపోతూన్నది.

వనం ముందుకి దూకి, శాంతజడ పట్టుకున్నది. శాంత కలవరపడి, తప్పించుకోవలెనని చూసి, వశముకాక, నిలువబడి పోయింది.

'సిగ్గులేదూ ?. .'

శాంత ఊరుకున్నది,

'మాట్లాడవేం. .'

శాంత ఎకసెక్కెంగా నవ్వి. .

'అవును. .అందరికీ. . కాంతంలాటివాళ్లు దొరకవద్దూ'! అన్నది.

—వనం ఒళ్లు మరచిపోయింది. ఆకోపంలో, చేయి ఎత్తింది.

'చిన్నమ్మాయ్! . .'

వాళ్ళ నాన్నగారు క్రిందనుంచి కేకవేశారు. . శాంత తప్పించుకున్నది.

3

'నీవుకూడా రావూ ?'

భోజనంచేసి మేడమీదికి వెళ్ళబోతున్నది వనం. కాంతం పైనుంచి ఎదురువచ్చాడు . . తప్పించుకుందామని చూసింది. కాని మాటాడకుండా వీలు లేకపోయింది.

' ఉహూ . . ' అని తలఊపింది.

' రావూ . . నీవుకూడా వస్తావని, చాలా . . అనుకుంటున్నాను . . రావూ.'

వనం ఊరుకున్నది. కాంతం, దగ్గరికి వచ్చి . . ఆమె చెక్కిలి నిమురుతూ,

‘ రావూ . . ’ అన్నాడు . .

ఆ అమ్మాయి అతనికి ఎడంగా జరిగి . . చాలాదీనంగా,

‘ కాంతం? . . నన్ను ఎందుకూ ఈలా హింసిస్తావూ, అన్నది. ఆతడు తెల్లబోయినాడు.

‘ ఆయన . . నీస్నేహితులుకారూ? చనిపోయినవారు, కాని, నామనసులోనుంచి పోలేదే . . నీమిత్రుడి భార్యను . . అంటుపరచాలని చూస్తావా? అప్పుడు, నేను ఈస్పృహలో లేను . . నీస్నేహితుని . . తలచుకుంటూ . . నీవు . . ఈ పెదవిని . . ఈ . .

ఆ ఆవేశంలో బలంకొద్దీ పెదవిమీద కొట్టుకుంది. . నెత్తురు కమ్మింది.

‘చూశావా. . ఇదుగో. .’

పిడికిలితో మళ్లా కొట్టుకున్నది. కాంతం అక్కడ నిలువకుండా క్రిందకు వెళ్లిపోయినాడు. వనం ఆలాగే చాలాసేపు తలవంచుకుని నిలుచున్నది.

‘అమ్మాయి, వనం ! అక్కడ నిలుచున్నావేం ?

అని వెనుకనుంచి ముసలమ్మ. . మాామ్మ. . కేకవేసింది.

'ఏమీలేదు. . పైకి వెళుతున్నాను. .' అని వనం గబ గబ మెట్లు ఎక్కిపోయింది.

గదిలో బల్లమీద . . ఆతని . . ఫోటో ఉన్నది. వనం దాన్ని తీసుకుని, చాలా జాలిగా చూస్తూ,

'నన్ను. .వదిలి పెట్టి వెళ్లారు కాదూ. .నేను . .కూడా వస్తా . .'

అని వెక్కి వెక్కి ఏడువ మొదలుపెట్టింది. .

. .గుమ్మంలో, శాంత నవ్వుతూ నిలుచున్నది . . వనం ఆమెను చూసి, కళ్ళ నీళ్లు ఆపుకుంటూ, అక్కడనుంచి వెళ్ళి పోబోయింది. శాంత దగ్గరకువచ్చి,

'ఏమి తోచదా ఏం నీకు, వనం! . . . ఎప్పుడూ ఓ లే శోకాలా? లే. .వేళయింది, నాటకానికి వెళుదాము. .'

వనం కోపంగా. .

'నేను రాను. .'

'ఎందుచేతనో?,

'నాయిష్టం!'

'పోనీ. .నేను పనికి రాకపోతే . . మీా కాంతం . .'

వనం ఏమీ మారుపలుకకుండా . . తన ఏవగింపంతా ఆమెకు అర్థమయ్యేట్టు శాంతవంక జూచింది,

శాంత, ఆ బాణాన్ని లక్ష్యంచేయకుండా నవ్వి. .వనం చేతినుంచి ఆ చిత్రాన్ని లాక్కుని. .సావకాశంగా చూసి.

"చక్కనివాడేనే. .వనం. .మీ ఆయన. .'

అని ఆ చిత్రాన్ని ముద్దిడుకున్నది.

—'ఇంకా కదలరేమమ్మా! పది కావచ్చింది. .అరగంట నుంచీ కారు వాకిట్లో ఉన్నది. . లేండి . . ఇంకా ఎంతసేపు?,

తాతగారు, ఓపికచేసుకుని మేడమీదికివచ్చి హెచ్చరించారు. శాంత. .

'చూడండి, మరి . . వనం రాదుట !' అన్నది.

వనం కూడా అందుకుని. .

'నేను వెళ్ళనండీ . . పోనిద్దురూ' అని, ఏదో పుస్తకం తీసుకున్నది, బల్లమీదనుంచి.

'అదేమిటమ్మా . . వెళ్ళిరా, బాగుంటుంది . . నీకోసం టిక్కెట్టుకూడా తెప్పిస్తే . .'

'పోనీ ఇంక ఎవరినైనా పంపండి'

'సరే, మీ యిష్టమమ్మా . .నామాటలు వింటారా'

అని ముసలాయన విసుక్కున్నాడు. ఆయన్ను నొప్పించడ మెందుకని, వనం ఒప్పుకున్నది.

—'నీవే కూర్చుందువుకానిలే కాంతం ప్రక్క . . బలే . .'

మెట్లుదిగి వస్తున్నారు . . శాంత వనంతో మెల్లిగా అన్నది . . వనం క్రిందకు చెంగున దూకింది.

'ఇలా కూర్చో. పోనీ నీయిష్టం . . ముందుకూర్చో' అన్నాడు కాంతం. వనలత ముందు ఎక్కపోయింది . . శాంత నవ్వి,

'అవును . . రజాక్ ప్రక్కను . .బలే బాగుంటుందిలే. . కూర్చో . .'అన్నది. వనం మళ్ళా తిరిగి వెనుకనే ఎక్కింది. ఆమె వెంట శాంత, తరువాత కాంతం ఎక్కారు.

మూడు గంట లయి ఉంటుంది . .నాటకం చాలా ఆలస్యంగా అయింది.

అంతకుముందు విన్న డ్యాన్సుసాంగు . . వచ్చి రాని ఫణతిలో . . ఈలతో విసురుతూ, డ్రైవరు, కారు వదిలాడు. వనానికి నిద్ర తూలుతున్నది . . ముందుకువాలి నిద్రపోయింది.

ఉలిక్కిపడి లేచింది. ఇంకా కారు సాగుతునే ఉన్నది. . నిద్రపట్టడంతోనే, అంతలో కలవరపడి మేల్కొంచింది.

అందుకనే . . ఆ అవమానానికే కాబోలును . .

రజాక్, ఆమెమీద చేయివేశాడు . . ఆమె విదిలించుకుని ప్రక్కకు ఓసరిల్లింది.

ప్రక్కను ... శాంత ... కాంతం కౌగిలిలో ఉంది.

౪

ఫోను మోటారు స్టార్టుచేసింది శాంత.

"...జాలముచేసి కలసి...ఏ లీరతనాల జామి

కీలజత పంపేసన్న ...తాలవనలోలా ...అల...

నీమాట లేమాయెనురా ..సామీ...పల్కరా..."

'ఎప్పుడూ ...ఆ పాడు జావళీలేనా...మరేవీ లేవ్వూ...' అన్నది వనం...ఒళ్ళు విరుచుకుంటూ, సోఫాలోనుంచి లేచి. .

'చాలా బాగుంటాయి...ఇది...విను...'

శాంత మళ్ళా ఒక క్రొత్తరికార్డు పెట్టింది...వనం చిడిముడిపాటుతో అక్కడనుంచి లేచింది.

'వనం ! ... ఇవాళే క్రొత్తఫిల్ము ఒకటి తెచ్చాను. తాతయ్యగారు కూడా చూస్తానన్నారు నీవురావ్వూ, శాంతా నీవుకూడా వస్తావా ...'

అని రమేశం ఎదురుచూచ్చాడు...

‘వీటి తాతలలాంటివి చూశాను, దాచుకో, నేనురాను నాయనా! తాతయ్యగారికి చూపించు కావాలంటే...ఆయనకు మహాఓపిక’ అన్నది శాంత...రమేశము చిన్నబుచ్చుకున్నాడు. వనం అతని బుజంమీద చెయివేసుకుని, శాంతవంక తిరిగి అయినా చూడకుండా,హాలులోకి వెళ్ళిపోయింది.

చూసింది కొంచెంసేపు...ఇక చూడలేక పోయింది... ఎక్కడ చూసినా శృంగార లీలలే...

ఇవతలికి వచ్చింది...ఇంకా ఫోను వినబడుతూనే ఉంది. మధ్యమధ్య...ఆ ధోరణిలో కలసీ కలియకుండా శాంత సంగీతమూను...

ఏమీా తోచడం లేదు, ఏదన్నా చదువుకో వచ్చును కదా అని, ప్రక్కగదిలోకి వెళ్ళబోయింది కాని, గుమ్మందాకా పోయి ఆగింది. లోపల, వాళ్ళ నాన్నగారు, కాంతానికి వేదాంతం చెపుతున్నారు...వనం వింటూ నిలుచున్నది...

—చూశావా... సంస్కారమంటే అదోయ్...కఠవల్లిలో...ఆయముడు...నచికేతుణ్ణి అడుగుతాడు... “యే యే కామా దుర్లభా మర్త్యలోకే సర్వాన్కామాన్ఛందతః ప్రార్థయస్వ..” అని.. “ఇమా రామాః సరథాః సతూర్యా నహీదృశా లంభనీయా మనుష్యైః..”ఈ మాదిరిగానే ఎంత ఊరించినా.. ఆ పిల్లవాడు.. వయసుకు పిల్లవాడే కాని.. మహానుభావుడు, లొంగికాడేమో చూశావు. “వరస్తుమే

వరణీయ స్సవవ ..” అని ఆత్మవిజ్ఞానం కావాలన్నాడోయ్ .
వాడా .. ఇప్పటి కాలపు రకాలా ..

“ఇప్పటిరకాలా .. శ్వసతికథ మసౌ రసాలశాఖాం చిరవిరహేన విలోక్య పుష్పితాగ్రాం .. ఈ బాపతేనోయ్ .. అసలు నేను చెప్పవచ్చింది ఏమంటే .. శంకరుడు వీళ్ళ అందరిలోకి నాయకమణోయ్ .. శంకర మతం .. నీకు సులువుగా అరగంటలో చెపుతాను .. ఎంతవాడో నీకే తెలుస్తుంది .. భాష్యంలో .. ప్రచురానంద ..

—“ఇప్పుడే వస్తాను ఉండండి .. అని కాంతం తప్పించుకుని వచ్చేశాడు ..

“ఏమండీ శంకరాచార్యులుగారూ ..” అని పలుకరించింది శాంత, వనం వెనుకనుంచి. ఎప్పుడు వచ్చి అక్కడ నిలుచున్నదో వనంకూడా గమనించనే లేదు ..

కాంతం నవ్వి,

“వెనుకటి శుకుడితపం చెడగొట్టడానికి రంభ వచ్చిందట మరి, శంకరుడి ..”

‘...ఈ ఊర్వశి...’ అని కనుసైగతో వనాన్ని చూపించింది శాంత. ఆతడు ఆమెవంక సాభిప్రాయంగా చూసి, ఏ కళ నున్నాడో, అక్కడనుంచి వెళ్ళిపోయినాడు.

'వనం...'

అని ఆమె బుజంమీద చేయివేసింది, శాంత.

వనం...'ఏం' అని తలఊచి అడిగింది...

'కాంతం...నిన్ను ప్రేమిస్తున్నాడు...ఆతన్ని...'

వనం ఆమెమాటకు అడ్డంవచ్చి...

'వద్దు...నాతో ఈమాటలుచెప్పద్దు...'అన్నది.

శాంత రుంజకుంటూ...

'అబ్బ...ఎంతఇల్లాలివే...' అన్నది...

వనం ఆడుపులిలాగా చెలరేగి...

'నేనా ... నన్ను అనడానికి నీకు అభిమానంలేదూ ... నిన్ను...నీవుచేసే పనులను చూస్తే...ఇల్లాలినా... కాను — నామగడు...ఏలోకంలోనో ఉన్నాడు ..నీవు...నీవు'

శాంత ముందుకువచ్చి వనం చేయిపట్టుకుని,

'ఏమన్నావూ...జాగ్రత...'అన్నది...

'చేయి వదులు'

'వదలను, ఏంచేస్తావు?'

"వదలవూ?"

'ఊహూ...'

- ఠపీమని కొట్టింది వనం శాంతను. ఆ దెబ్బకు నిలుకడ తప్పి క్రిందకు ... మెట్లమీదుగా దొర్లుకుంటూపోయి ... మేడ

మీదికి రావాలని మెట్టుమీద అడుగువేస్తూన్న — తాతగారి మీద పడ్డది. ఆయన అయ్యో — అయ్యో ... అనుకుంటూ క్రిందపడిపోయినాడు.

వనం గబగబ క్రిందకు వచ్చి—శాంతవంకైనా చూడ కుండానే, తాతగారిని లేవదీసి, ఆయనను సాయమై లోపలకి తీసుకునిపోయింది.

౨౪

— ఎత్తినతల వంచకుండా, పైన తిరుగుతూన్న విమానా లని చూస్తూ నిలుచున్నది వనం పైమేడమీద. .

కొంచెంసేపు తిరిగి . . చివరకు కనబడకుండా పోయి నాయి... 'స్వర్గంలోకి వెళ్ళే విమానాలు ..ఎలా ఉంటాయో.'

...ఏమేమో తలపోసికుంటూ కన్నీరు పెట్టుకున్నది వనం.

'చూడు...చూడు, అక్కయ్యా!

ప్రభావతి వనాన్ని హెచ్చరించింది ... వనం ఆకాశం వైపు చూసింది...

'అక్కడ కాదు...క్రింద...తోటలో...అదిగో నీలాం బరాలదగ్గర...

వనం చూసింది...చూసి తలతిప్పుకున్నది.. మామూలే శాంతా...మరి ... ఓ ...

'శాంతా... ఇదిగో... ఇక్కడ...'

పిట్టగోడమీదుగా వంగి ప్రభావతి పిలవడం మొదలు పెట్టింది చేయివిసురుతూ. వనం వద్దని వారించింది, కాని అల్లరి పిల్ల, ఆమెను వినిపించుకోడం లేదు..

ఎంతో వయ్యారంతో, కులుకుతూ, శాంత వచ్చింది అక్కడికి.

'ఏం... ద్రౌపదిని మించిపోతున్నావ్ ?' అన్నది వనం. శాంత నవ్వి, ఆ మాట మార్చేసి, తలలో పూలదండ సరి చేయమని దగ్గరకు వచ్చింది.

—ఇద్దరూ క్రిందికి దిగి వచ్చారు...

హాలులో తాతగారు పేపరు చదువుకుంటూ కూర్చు న్నారు...

'ఎక్కడికమ్మా !..' అన్నా డాయన ఇద్దరిని చూసి..

"షికార్ వెళ్ళివస్తామండీ.." అని శాంత జవాబుచెప్పి, వనం అడ్డుచెప్పకముందే ఆమెను లాక్కొనిపోయి కారు ఎక్కిం చింది.

"త్వరగా పోనీయవోయ్" అన్నది శాంత రిస్టు వాచి చూసి. .

"ఇంకా ఎంతత్వరగా. . అక్కడేమీ మించి పోవడం లేదు. ." అని రజాక్ మాట వెన్నుమీదుగా విసిరాడు.

"ఏమిటోయ్. . ఒళ్ళు దగ్గరపెట్టుకుని మాటాడు." అని వనం అందుకున్నది. .

"పోనీలే. . ఫరవాలేదు. ."అని శాంత సర్ది చెప్పబోయింది.

కారు గోదావరి ఒడ్డున ఆగింది. ఇద్దరూ దిగి నడుస్తున్నారు. ముందుకు పోయి కూర్చుందామని. .

"రజాక్ దగ్గరనుంచీకూడా. . నీవంటే అంత అలుసేనా" అని మందలించింది వనం . .

"వాడి మొగం. . ఏమీ తెలియదు. అమాయకుడు"

"మన నౌకరు. ."

"పోనీ లెద్దూ. ."

ఒకచోట కూర్చున్నారు. సన్న పట్టుచీరెమీది నులిముడతలులాగా గోదావరిమీద, లేత అలలు పొటకరిస్తున్నాయి.

వనం గోదావరివైపు చూస్తూ, పడుకునిఉన్నది. శాంత, ఆదుర్దాతో దిక్కులు చూస్తూన్నది.

"ఇప్పుడే వస్తాను ఉండు" అని శాంత లేచినిలుచున్నది.

"ఎక్కడికి"

"ఎక్కడికీ లేదు. . ఇప్పుడే వస్తానుకాదూ. ."

ముందుకు సాగిపోయి. . తిన్నెలు చాటవడంచేత కనబడకుండా పోయింది శాంత. . వనం ఆమెవైపైనా చూడలేదు. .

క్రమంగా చీకటి మూసుకువస్తూన్నది. ఎవరో వెనుకనుంచి. . వనంకళ్లు మూశారు. ఆ అమ్మాయి కలవరపడి లేచికూర్చుని, బలవంతాన ఆ చేతులు తీసివేసింది .

కాంతం. . నవ్వుతూ నిలుచుని ఉన్నాడు. .

"కాంతం !. . నీకు జాలిలేదూ. ." అన్నది వనం. ఆతడు ఊరుకున్నాడు. .

"దయయుంచి ...నన్ను బ్రతుకనీయవూ..."

"దయయుంచి ... నన్నూ బ్రతుకనీయవూ ... వనం! నిన్ను విడిచి బ్రతుకలేకుండా ఉన్నాను...,"

కాంతం మరీదగ్గరకు వస్తున్నాడు...

"వద్దు...ముందుకు రావద్దు"...అని తాను వెనుకకు నడిచింది...వనం.

"ఉమా ..నీవు నాకు కావాలి..వనం.."

కాంతం ముందుకు వస్తున్నాడు..వనం చకచకా[redacted]కు కకు అడుగులు వేస్తూన్నది.

"ఊరుకోవూ..కాంతం!..'

కాంతం వినిపించుకోలేదు..వనం. ఆగకుండా వెనుకకు అలాగే నడచిపోయి..

గోదావరి మామూలుగానే ప్రవహిస్తూంది..ఆ పిల్లను తనలో చేర్చుకోడానికి..రవంత ఎడమైంది..మరల కలుసుకుని కమ్ముకుపోయింది..

కాంతం అక్కడనే కూలబడిపోయినాడు..

చాలా చీకటిపడ్డది. రజాక్ హారన్ వేస్తూన్నాడు.. శాంత నవ్వు చూచాయగా వినిపిస్తున్నది..

---